ఫోన్ : 2066

టెలిగ్రామ్: హిందీసంఘ్

సంపుటి 7

సంచిక 6

# స్రవంతి

సాహిత్య మాసపత్రిక

*



*

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

959 ఖైరతాబాదు, హైదరాబాదు - 4

| సంవత్సర చందా | సెప్టెంబరు | విడిప్రతి |
|---|---|---|
| రు. 4-00 | 1960 | 35 నయాపైసలు |

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

# ఈ సంచికలో

సంపాదకీయం

# జాతీయ భాష

భారతదేశమున గుణకర్మ విభాగ దృష్ట్యా అనేక జాతులు, పరిసర జల వాయువుల ప్రభావము వలన అనేక భాషలు ఏర్పడినను అనేకత్వమునుండి ఏకత్వములో భారత జాతి, భారత జాతీయ భాష తన జాతీయతను తాను పెంపొందించుకొనుచు ముందుకు సాగుచునే యున్నది. ఈ మధ్యకాలమున విధివశాత్తు విదేశీయ పాలనలో అణగి మణగి యున్నను మరల తల యెత్తుచునే యున్నది.

జాతీయ భాషగ ఒకప్పుడు వేదభాష, మరి యొకప్పుడు సంస్కృత భాష హిమాలయమునుండి కన్యాకుమారి వరకు కన్యాకుమారినుండి హిమాలయము వరకు ప్రబలమైన వేగముతో ప్రయాణములు సాగించినవి. ఒకప్పుడు పహాడీ భాష పదాలు త్రొక్కితే మరి యొకప్పుడు హిందుస్థానీ భాష కదం త్రొక్కినది. అనేక ప్రాంతీయ భాషల వారు తమ తమ ఆధ్యాత్మిక ఆస్తిక నాస్తిక భావములను మత, రాజకీయ సమస్యలను ఆదాన ప్రదాన మొనర్చుటకు ఏక భాషనే సాధనముగ చేసుకొనెడు వారు.

ఆ జాతీయ భాషలలో సంస్కృతమును విజ్ఞాన ఖనిగ రత్న గర్భగ రాణింపజేసి ప్రపంచ విజ్ఞాన వేత్తల ప్రశంసలను అందుకొనుచు మాది భారతదేశము, మేము భారతీయులము, మా భాష భారతి యని విదేశీయ విద్వాంసుల ముందు విజయ గర్వముతో విహరించెడి వారు.

ప్రస్తుత పరిస్థితులకు అనుకూలముగ హిందీ అను పేరుతో వ్యవహరింప బడుచున్న భాషా భారతిని జాతీయ భాషగ దేశీయ నాయకులును, అధికార భాషగ ప్రభుత్వము వారు అంగీకరించి యున్నారు.

సహజముగ మానవులు తమ తమ మాతృభాషల వలన సమైక్య

జాతీయత యను పేరుతో మనము పిలచెదము భాషా మూలకమైన. సంఘీభావమే జాతీయతకు ముఖ్య చిహ్నము.

ఏక భా తో ఏకమైన ఒక జాతి తాను నివసించు భూభాగము నందు మాతృప్రేమ గలిగి జనని కంటె జన్మభూమియే యెక్కువైన దిగ భావించి మన్నించును. ఇది నా దేశము, ఇది నా దేశ భాష యను జాతీయ భావములతో ఉప్పొంగుచుండును. ఈర్ష్యా ద్వేషములకు తావు లేకుండా పోవును. ఏక భాష, ఏక హృదయము సర్వతో దిగ్విజయము.



# ముక్త భారతి

—శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

అభ్యర్హితము తపంబైన సాత్యవతేయు
వాఙ్మాధురులకు రూపంబు వొడమి
రామతత్వం బక్షరాకృతి యైన పో
తన్న కైతలకు చైతన్య మొదవి
శ్రీరంగనాథునె చ్చెలివోని నెందమిళ్
కంబరు సూక్తి దేహంబు నొంది
సుర దుర్లభం బైన సుధ బోలిన మణి ప్ర
వాళ శైలికి తనూ లీల యొసఁగి
ప్రతి పదము పాండురంగని పజ్జ నిలిపి
నట్టి తిల్లిక యైన రసార్ద్రహృదులు
భక్త కులముల దీవెనల్ పరిమళించి
తరలి వచ్చెను నేడు స్వాతంత్ర్య లక్ష్మి

ఆ సౌందర్యము సూచి మోహ కలితం వ్యాకృష్టులై, "నేను నే
నీ" తాతోపతి నేలి కొందుననుచున్, హేరాళ దుస్సాహస
వ్యాశీర్ణాత్ములు. వచ్చి ముట్టి కొన హంసా * నంది యానంబుతో
నా శీతాంశు ని భాస్య దాఁ గ దలెఁ దిర్యగ్వక్రితాపాంగయై ॥

ఆమె చూచిన యెడంత్యమృతములు శా
రద చంద్రికా సరో రాసు లుబికి
ఆమె నవ్విన తావు లామోదిత దిగంత
ములు నిత్తై మల్లెలు పెలఁగి నవ్వి

ఆమె నిల్చిన చోటు లతివేల శాలి ధా
న్యములు భూమి భూషలై యెసంగి
ఆమె పల్కిన పట్టు లాత్మ విత్సుక విత
ల్లజ శబ్ద యోగ వల్లకులు పలికి
ఆమె దయ పూని నట్టి పుణ్య ప్రదేశ
ములు శత బ్రహ్మముల తీర్థములుగ నెగడి
యఖిలలోకైక జనయిత్రి యధివసింపఁ
దగిన తలముల రోయుచుఁ దరలి, తరలి,—

పోవను బోవ నొక్కట నపుష్ట శరీరుడు, పూతిగంధ వ
స్త్రాళి విలమూర్తి, నాగరక జాతి వివంచితు. డాత్మధర్మ క
ర్మాలి రత ప్రయాసుడు, నిరాదృతు డౌ కడ జాతి వాడు, దై
న్యావసథంబు డోచిన దయామతి భార్గవి నిల్చె నచ్చటన్.

అత్తఱి వెంట నుండిన పరాత్మ విశేష వివేక శూన్యులు
ద్వృత్తులు చెల్లరే! పదను చేలియ వోని మనోహరాంగి యీ
నెత్తుపు వల్చు తాపులను నిల్చుట యేమి? సురూప వేష దీ
వ్యక్తను లింద రుండ సని యాడిరి తద్విరహోపకృష్టులై.

కడ జాతి వానితో న
ప్పుడు పలికెను భువన మాత, పూతమతీ! యి
య్యెడ నిలువఁ దలఁతును చితపు
వడువున నన్నేలి కొందువా! ఇక ననుచున్.

రమ్మ! జగ ద్వ్యథా దవని రాసకపుల్ భవదీయ పాదముల్
నెమ్మిని మోప వమ్మ జననీ! యని పక్షము జూపి సంతలో
కమ్మల తల్లి నిల్చిన కప్ప శతంబును బోలి, దిక్కుడుం
గమ్మల యందు మ్రోగినవి కమ్మని భారత కీర్తి ఘంటికల్

(ది 14-8-60 న ఆకాశవాణి కవి సమ్మేళనంలో జదివినది)

# భీమఖండము: పాఠపరిశీలనము

—శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

(గతసంచిక తరువాయి)

## 32. 'కాడయొనర్పు'

"కాశిం బుణ్యరాశిఁ, గాడు నొనర్పఁ జూచెను" (2-116)

అని, పూ. పా.— "రాశికిఁ గాడ యొనర్ప" అని శా. పా.— పద్యములో నున్నది. 'కాడు' గాని, 'కాడ' కాదు కాడు=కీడు. కాడు చేయు; కాడుపడు—అను క్రియలును ఉన్నవి.—

సూ. ని., 'కాడ యొనర్ప'-'కాడునొనర్ప' అను పాఠములను కుండలీకరణమున చూపి, తాను "రాశిం గాడొనరింప" అను పాఠమును గ్రహించినది. 'కాడునొనర్ప' యన్నను, 'కాడొనరింప' అన్నను అర్థమొకటే యైనను, 'కాడొనరింప' యనుటలోనే సరసతయున్నది. "కాడయొనర్ప" యనుట మాత్రము సరికాదు.

## 33. 'మలయ'

"ప్రతిదినము దక్షవాటీ పురంబునందు
మలయ వేలావనీ మంద మారుతంబు
గంధసార లతాకుడుంగముల మెలఁగు
చిలువలేములు సేవింప వెలితిపడుచు" (1-98)

అని రెండు ప్రతులలోను పాఠము—

ఈ పాఠమున తప్పున్నది. 'వేల' యనగా, చెలియలికట్ట (సముద్రపు గట్టు) గాని, పర్వతతటము కాదు. కాబట్టి, "మలయ వేల" అనుట పొసగదు. అది యట్లుండగా, పద్యమున క్రియాపదము లేదు. అందువలన,— మలయ వేలావనీ మంద మారుతము, గంధసార లతాకుడుంగముల యందు మెలగునట్టి చిలువలేములు ఆరగించుట చేత వెలితిపడుచూ—వచ్చి— దక్షవాటీ పురమునందు ప్రతిదినమును చేయు పనియేమో, యేర్పడుట లేదు.

ఈ యనర్థమునకు మూలము "మలయవేలా" అను పాఠము. అది 'మలయ' కాదు; 'మలయు'. క్రియ.—

దక్షవాటియందు, ప్రతిదినమును ప్రభాతకాలమునందు సముద్రతీర వనవాయువు— మంచిగంధపు పొంపల గుంపా వచ్చి— (సువాసనతో గూడి— అన్నమాట), మలయుచు=విహరించును-అని యర్థము. దక్షవాటి సముద్ర తీరముననే యున్నది.

"అంబుధి మేర తూర్పునకు, నద్రులు సీ
మటు యామ్యదిగ్విభాగంబునకు" (5–77)

ప్రకృత పద్యమున "మలయు వేలా" అన్నది అపపాఠమని వివక్షితాంశము.

## 34. 'కమ్మిం(జాగిన'

"కమ్మినూకిన నూత్నకలధౌతమును బోలె" (4–130)

అని, పూ. పా.—శాస్త్రిగారు "కమ్మినూకిన" అను పాఠమును దిగువ జూపి, "కమ్మిం(జాగిన" అను క్రొత్తపాఠము నెగువ జేర్చినారు. ఆ పాఠమెక్కడిదో! వారు చెప్పలేదు.

'నూకు' బూతుకూత యన్న భావమున వారే అట్లు మార్చిరేమో! అది బూతుకాదు. జాతీయమైన పలుకుబడి.

సూ. ని., కమ్మినూకు=కమ్మచ్చున( దీయు" అని యర్థము చెప్పి, ఈ పద్యమునే ఉదాహరణకు చూపినది అట్టి పాఠమును మార్చుట సరిగాదు. పూర్వపాఠమే ఉండదగినది.

## 35. 'పోటు'

"లోలాక్షునకు నీకు లోలోన నేమేని(
బోటి పుట్టదుగదా మాటమాట" (2–83)

అని, పూ. పా.— "పోటు పుట్టదు గదా" అని, శా. పా.—

'పోటి' యనుటయే సరి. శ. ర., సూ. ని. కూడా, "పోటి=స్పర్థ, ద్వేషము" అని యర్థము చెప్పి, అంగుళీ, పూర్వపాఠమునే యిచ్చియున్నవి.

'పోటు' అనగా, బాధ-తలపోటు—ఇత్యాదులు, ఆ యర్థము. సరిపడదు. కావున 'పోటు' పాఠము గ్రాహ్యము కాదు.

### 36. 'పొలపాడు'

" వలిచన్నుఁ గవలపైఁ బొలసాడు బొలసాడి
నాభిరంధ్రములపై నటనసేయు" (4-140)

అని, పూ. పా.— "పొలపాడుఁ బొలపాడి" అని, శా. పా.—

'పొలపాడు' అను క్రియలేదు. (పొలసి + ఆడు) 'పొలసాడు' అనియే క్రియ శ. ర; సూ ని. కూడా, యీ క్రియనే చెప్పి, ఈ పాఠమునే గ్రహించినవి. జక్కనయు 'పొలసాడు' అనుక్రియను ప్రయోగించినాడు.

" బొండు మల్లియలపైఁ బొలసాడుఁ బొలసాడి
పుష్పంధయంబులఁ బోవఁ జోపు" (విక్ర. 1. 95)

'పొలపాడు' అను పాఠము నిరాకరము.

### 37. "నాగులు"

" ధరణిదానంబుచేసిన ధన్యుఁ డడఁచు
నఘ్యఘము ... ...
కుబుస మూడ్చెడి మేటి నాగువును బోలె " (5. 71)

అని, పూ. పా.— " మేటి నాగులును బోలె " అని, శా. పా —

" నాగువు " అపశబ్దము కాదు. "నాగు" నకు విశేషరూపము. శ్రీనాథుడు శృంగార నైషధమునను వాడియున్నాడు.—

" వనాంతరమ్మునన్. మలఁగి మలంగి పెంజిలుము నాగువు భంగి " (7. 154)

సూ. ని; 'నాగువు'ను మూలపదములలో చేర్చి, యీ 'భీమ'; శృం. నై. పద్యములనే చూపినది. అట్టి పదమును 'నాగులు' అని మార్చుట ప్రాచీనరచన కపచారముచేయుట యగును.

అది యట్లుండగా, భూదానము చేసినవానికిని, కుబుసమూడ్చెడి నాగువునకును పోలిక. ఉపమేయమైన దాత యేకవచనమున నుండగా, ఉపమానము 'నాగులు' అని బహువచనముననుండుట కూడదు. అది భిన్నవచన దోష మగును. కావున 'నాగువు' పాఠమే సాధువు.

### 38. "ఏలుకొంద్రు"

" పలుకొంద్రు మీరలే పురాంతకునకుఁ
బృథివి యీగి బిడ్డ బిడ్డతరము
బ్రతుకుఁ డాశ్రయించి ఫణిరాజకుండలు " (5. 82)

అని, రెండు ప్రతులలోను పాఠము. "పలుకొం(డు" అను పాఠము సరిగాదు. పలుకొం(డు-అనగా, పలుకొందురు-అనియర్థము. ఆ యర్థము కుదురదు.

పద్యమునను న్న 'బ్రతుకుఁడు' అన్న రెండవ క్రియవలెనే, మొదటి క్రియయును, 'పలుకొనుఁడు' అని విధ్యర్థముననే యుండవలెను. అందు వలన, పాఠమును 'పలుకొండు' అని మార్చుట అవసరము. కొండు= కొనుఁడు. (చూ. బాల. క్రి. ౬౧).

శాస్త్రిగారి పాఠము 'ఈఁగి' అని అరసున్నతో నున్నది. 'ఈవి' యను నర్థమున 'ఈగి' నిరనుస్వారము. కావున, ఆ యరసున్నను తొలగించ వలెను.

## 39. 'నట్టిండ్లు'

"కూర్పించె నట్టిండ్లు కుందనమున" (5. 88)

రెండు ప్రతులలోను పాఠమిట్లేయున్నది. ఈ ప్రతులలోనే కాదు, శ. ర. లో 'నట్టిల్లు' అను పదము క్రిందను పాఠమిదే.—

ఈ పద్యమున 'నట్టిండ్లు' అనియుండుట తప్పు. 'నల్లిండ్లు' అని యుండవలెను. (దీనినిగూర్చిన చర్చ నా 'సాహిత్యసమీక్ష' లో విపులముగా నున్నది. వలయువారు, అందు, 3వ పుట చూచునది). 'నల్లిల్లు' సప్త సంతానములలో చేరినది. అందుకీ క్రింది శాసన పద్యము ప్రమాణము. ఈ పద్యము నాకిటీవల దొరకినిది.—

> "గుడియును జెఱువును వనమును
> నడరిన నల్లిండ్లుం గ్రితియు న(ల) పెన్నిధియు నుం
> గొడుకు లను సప్తసన్తతి
> నొడంగూడంగ నిలిపి సరసం డొప్పెంగీర్తిఁ గని"
>
> (శాస. మంజరి. 2వ భా. పు. 7)

ఈ పద్యము రాతిమీద చెక్కఁబడి యున్నది. కావున, నట్టిండ్లు" గాని, 'నల్లిండ్లు' కాదను వితండా వాదికీ యుదాహరణము వాకట్టు మంత్రము.

## 40. 'నద్వతి'

"అగురు జంబాలంబు నందు బెందడిచేసి" (5—101)

అని, పూ. పా.— శాస్త్రిగారు, 'బెండడి' నడుగున చూపి, పద్యములో "నడ్వలిచేసి" యన్నారు. ఆ పాఠ మెక్కడిదో! 'నడ్వలి' నిఘంటువులలో లేదు.

సూ. ని., 'బెందడి' కి, "రొంపి, ఇటుకలు ఱాళ్లు. మొదలగునవి కలిపి, గోడకట్టుటకు మధ్యను వేయు పలుచని మన్ను, సున్నము మొ." అని, యర్థము చెప్పి, యీ పద్యమునే యుదాహరించినది.

కాబట్టి, పూర్వపాఠమును మార్చుట సరికాదు.

## 41. 'అసలుగలిపె'

"ఔదలలయందు జవ్వాది యసలుగలిపె" (5—115)

అని, రెండుప్రతులలోను పాఠము. 'అసలుగలిపె' అనుట సరికాదు. 'అసలు కొలుపు" క్రియ—

"మసిబొట్టు బోనాన నసలుకొల్పినకన్ను
కొడుపుచేఁ దాటించు నెడపఁ దడప" (క్రీడా. 1-136.)

కాబట్టి, "అసలుగలిపె" అను పాఠము తప్పు. 'జవ్వాది యసలు కొలిపె) అని యుండనగును. అప్పుడు, జవ్వాజి మిసిదపూసెను అని యర్థమగును.

## 42. "విశాలలక్ష్మి" - "నిద్రించుచో"

"పూవుంబోణి! విశాలలక్ష్మిఁ గనుచుఁ బుష్పంబు మూర్కొంచు పి
ణావాద్యంబులు వించు నిష్టమధురాన్నం బర్థి సేవించుచుఁ
వేవేభంగుల నిల్చుచుఁ నడచుచుఁ నిద్రించుచో నీశ్వరా!
నీవే కర్తవు సుమ్మటన్నఁ బురుషుఁ వేధింప వే దోషముల్" (5. 191)

ఇది శాస్త్రిగారి పాఠము. పూర్వపాఠమును ఇదేగాని, అందు "అటన్న పురుషుఁ" అని యున్నది. అది అట్లేయుండనగును. (అటన్నఁ— అనుట సరికాదు.

ప్రకృతపాఠమున, "పూవుంబోణీ" యను సంబోధనమును, "విశాలలక్ష్మి"; "నిద్రించుచో" అను పదములును పద్యార్థమును భంగఘ్నుచేయు [illegible]

శాస్త్రిగారు 'విశాలలక్ష్మి'కి, 'విలాసలక్ష్మి' యను మరియొక పాఠము సూచించియున్నారు. ఆ పాఠమునూ, "అటన్న పురుషుఁ" అన్న పూర్వపాఠమునూ తీసికొని, 'నిద్రించుచో' అన్న క్రియను 'నిద్రించుచుఁ' అని మార్చితిమేని అర్థము దొరికివచ్చును.

అప్పుడు 'పూవుంబోణి' సంబోధనకాదు. 'పూవుంబోణి విలాసలక్ష్మి' యని (ష. త.) సమాసము. పూబోణి యొక్క విలాససంపదను కనుచుఁ— అని యర్థము. స్త్రీతో ఆనందించుచూ— అని భావము.

స్త్రీతో సుఖిస్తూ, పుష్పగంధాదు లనుభవిస్తూ. (ఈ రెండును అష్ట భోగములలోనివి.) గీతావాద్యాదులతో వినోదిస్తూ, తింటూ, తిరుగుతూ, నిద్రిస్తూ (= తానేపనిచేసినను); ఈశ్వరా! దీనికంతకును కర్తవు నీవే సుమా!, అటన్న పురుషుఁ = అని భావించే పురుషుణ్ణి, ఏ దోషములును వేధింపవు— అని పద్యార్థము.

కాబట్టి, 'పూవుంబోణి!' యను సంబోధనమున్నూ, 'విశాలలక్ష్మి' 'అటన్నఁబురుషుఁ'; 'నిద్రించుచో' అనునవియును అపపాఠములు.

నిద్రించుచుఁ + ఈశ్వరా = నిద్రించుచున్నీశ్వరా — అని దిద్దినచో సంధి తప్పుగాదా? అని సందేహింప పనిలేదు. అట్టిసంధి నన్నయాదు లొప్పినదే. శ్రీనాథుడును పలుమారు వాడినదే.—

"వినిపించె న్నశరీర భారతి" (3. 213)

"దక్షువాటికి న్ననుపమ రత్న పేటికి" (6. 10)

### 43. "ఎచ్చోట"

"ఎచ్చోటఁ దాఁ బాటె నిట్టిరూపముదాల్చి
యతి సాధ్వసంబుతో నధ్వరంబు
... ... ...
దక్షుఁ డెచ్చోటఁ బోట్టేలి తల ధరించెఁ
జిందు వందయ్యె నెచ్చోట నిందుఁ డనుచుఁ
జెప్పుదురు వీరభద్ర విజృంభణంబు
భీమ మండలి నుండు ప్రాఁ బెద్దమునులు." (3. 37)

ఇది పూ. పా.— శాస్త్రిగారి ప్రతిలోను, 'చిందువందు' అనుపదము క్రింద, వావిళ్ల— సూర్యరాయ నిఘంటువులలోను గూడా, పాఠమి

యున్నది. కాని, పద్యములో 'ఎచ్చోట' అని యుండుట తప్పు. 'ఇచ్చోట' అని యుండవలెను. ఎందువల్లననగా:—

అధ్వర మిష్టిరూపము దాల్చి యెచ్చోటఁ బాఱె;
దక్షుడు పొట్టేలితల యెచ్చోట ధరించె;
ఇందు డెచ్చోట చిందు వందయ్యె;-

అనుట, ప్రశ్నించుట యగునుగాని, చెప్పుట కాదు. వెనుక జరిగిన వృత్తములను చెప్పు వారు, ఆ యా విశేషములు జరిగినది, "ఇక్కడ - ఇక్కడ", అంటూ చెప్పుదురు గాని, ఎక్కడ ? ఎక్కడ ? అంటూ చెప్పరు. అట్లు చెప్పుట అసంభవము. అందువల్ల 'ఎచ్చోట' అని యుండుట పొసగదు. 'ఇచ్చోట' అనియే యుండవలెను.

నా మాట కీ క్రింది శ్లోకము దృష్టాంతము —

"ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్ర జహ్రే
హైమం తాలద్రుమవన మభూ దత్ర తస్యైవరాజ్ఞః
అత్రోద్భ్రాంతః కిల నలగిరిః స్తంభముత్పాట్య దర్పా
దిత్యాగంతూన్ రమయతి జనో యత్ర బంధూ నభిజ్ఞః"
(మేఘ. 1.34)

విశాలానగరమున నున్నవారు, క్రొత్తగా వచ్చిన తమ బంధువులకు, "ప్రద్యోతనుడు వాసవదత్త నెత్తుకొని పోయిన దిక్కడ": "అతడు బంగారు తాటి తోపు నాటిన దిక్కడ"; "నలగిరి యను గజము మదమెక్కి కట్టు కంబము నూడ బెరుకుకొని గంతులు పెట్టిన దిక్కడ" అని చెప్పు చుందురు - అని శ్లోకార్థము.

ఈ శ్లోకమును పోలినదే పై పద్యము. శ్లోకమున ప్రతి వాక్యముననూ "అత్ర" యని ఉన్నట్లే, పద్యమునను ప్రతి వాక్యముననూ 'ఇచ్చోట' అనియే యుండవలెను.

కాబట్టి 'ఎచ్చోట' అను పాఠము తప్పు. పద్యములోని 'ఎచ్చోట' ల నన్నిటిని 'ఇచ్చోట' గా మార్చ వలసినదే.

## 44. 'పూరగము'

"కమ్మని పణ్యారముతోడ బూరెగమితో" (2.67)

అని, పూ. పా. — శాస్త్రిగారు "బూరెగమితో" అను పాఠమును క్రింద చూపి, పద్యములో, -

"పణ్యారముతోడఁ బూరగముతో"

అను క్రొత్త పాఠమును చేర్చినారు.

'పూరగము' ఈ ప్రాంతమున వాడుకలో లేని మాట. శ. ర. లో లేదు: సూ. ని. లోను లేదు. ఆ రెండు నిఘంటువులలోను, ప్రకృత పద్యము, 'పణ్యార' మను పదము క్రింద "బూరెగమితో" అను పాఠముతోనే యున్నది.

మరి శాస్త్రిగారు 'బూరెగమి' నధఃకరించుటకును 'పూరగము' నుద్ధరించుటకును కారణ మేమో! 'పూరగము' అను పదముండిన నుండు గాక, శ్రీనాథుని రచనను మార్చ వచ్చునా?

## 45. 'తొలుమాయ'

'తొలుమామ యగు దక్షు నెలదోఁట నడుచక్కి
విహరణం బొనరించు వేడ్కఁ గాఁడు' (3.36)

అని, పూ. పా. - 'తొలుమాయ' అని, శా. పా. -

పూర్వ పాఠమే సరి. తొలుమామ = దక్షుడు. 'తొలుమాయ' అను పాఠ మర్థ శూన్యము.

## 46. 'దవ్వుచాలదు.'

'ఇపుడు ఘటికాద్వయం బయ్యె నినుఁడుపొడిచి
దవ్వుచాల దిచ్చోటికి దక్షవాటి
కేవలము మంచినడకైనఁ గీసవెల్తి
రెండుజాములు నిట నూరకుండ నేల!' (3.48)

రెండు ప్రతులలోను పాఠ మిట్లే యున్నది. "దక్షవాటి యిచ్చోటికి దవ్వు చాలదు" అనుట సరిపడదు. ఆ గ్రామ మిక్కడికి 'దూరము చాల' దనుట గాని 'చాలు' ననుట గాని వ్యవహారమున లేదు. అసలు దవ్వుకు చాలుట యేమి? చాలకపోవుట యేమి?

'దవ్వుచాల' దన్న మాటకు సమీప మని భావమా? సమీపమైతే, - "మంచి వడిగల నడకకైనను - కొంచెము తక్కువగా - రెండుజాముల ప్రయాణ" మన్న వ్యాఖ్యాన మెందుకు? ఆ వ్యాఖ్యానము, దక్షవాటి యిక్కడికి చాల దూరమని తెల్పుటకే గాని, దగ్గర యని తెల్పుటకు గాదు.

కాబట్టి "నవ్వులచాల దిచ్చోటికి" అను పాఠమును 'దవ్వుచాల నిచ్చోటికి-' అని మార్చుట సముచితము. ఇది పద్యమున్న తీరును బట్టి తోచిన సవరణ. మూలమును చూచినగాని నిర్ధారణ యేర్పడదు.

ఈ సవరణలో ఒక చిన్న చిక్కున్నది. "మంచి నడకైనఁ గీసవెట్టి, రెండుజాములు ఇట నూరకుండనేల" అనవలసి వచ్చును. అప్పుడు విసంధి యగును. - శ్రీనాథుడు నిరంకుశుడుగాపున అట్లే యని యుండవచ్చునను కొన్నను తప్పుగాదు గాని, ఈ యాక్షేపమును లేడమీయని పాఠము వ్రాత ప్రతులలో దొరకునేమో విచారించుట మంచిది.

ఇట్టి విసంధి ప్రయోగ మొకటి తిక్కన రచనలో కలదుగాని, అది యెక్కువ చర్చను పెంచు పెద్ద విషయమైనందున, ఇక్కడ చూపక వదలితిని.

## 47. 'కనుంగొన'

"శ్రీమద్విశ్వపతీశలింగము మదిం జింతింపఁ గాశీమహా
గ్రామం బిప్పుడు నా కనుంగవకు సాక్షాత్కారముం
గైకొనుణ" (2.90)

అని, పూ. పా. - శాస్త్రిగారు 'గవకు' అని పాఠమును క్రింద చూపి, పద్యమున, నా కనుం- 'గొనకు' అన్నారు.

'నాకనుంగవకు' అనుటలో తప్పేమో! 'నాకనుంగొనకు' అనుటలో సారస్యమేమో! నాకు బోధ పడలేదు. లోకములో "నా కండ్లకు కనబడు" ననుట కలదుగాని, 'నా కంటి కొనకు కనబడు" ననుట లేదు.

కాబట్టి, పూర్వ పాఠమే యుండదగినది,

## 48. 'విడి నీరు'

"పంకేజట విరినీట నిరుగారునుం బండు" (2.54)

అని, పూ. పా. — 'విడి నీట' అని, శా. పా. —

'విరినీట' - తప్పు. 'విడినీట' అను పాఠమే ఒప్పు. విడి నీరు = పంట కాలువ నీరు. (శ. ర. లో లేదు.)

"సెగడు పేర్చిందు లను విడినీరఁ బ్రియుఁడు
గరజవాలములఁ బై పూఁత గలయ గలచి

కామబీజంబు లలుక వేగమున మొలచు
మొలక లన మేన నిండ ముత్పులక లెసఁగె"
(నన్నె. కు. 8.178)

శాస్త్రిగారు 'విడి నీరు' అను ప్రాతపలుకు బడిని గుర్తించి, పూర్వపు తప్పు పాఠమును చక్కబరుచుట ప్రశంసింపదగిన పెద్ద విషయము.

## 49. 'సచ్చారుపు'

"సంబారములతోడి శాకపాకముతోడఁ
బక్వమైన పెసర పప్పుతోడ" (1.61)

అని, పూ. పా.— శాస్త్రిగారు 'సంబారముల' అను పాఠమును క్రింద చూపి, మూలమున, —

"సచ్చారువులతోడ శాకపాకములతో"

అను పాఠమును చేర్చినారు. 'సచ్చారుపు' అను పాఠమెక్కడిదో, అసలాపదము తెనుగో! సంస్కృతమో! నాకు తెలియలేదు. అది యెక్కడిదైనను, ఏదయినను సాధు పాఠమది కాదు. పూర్వ పాఠమున్నూ అసాధువే.

"శాకపాకములతో సంబారములతోడఁ
బరిపక్వమగు పెసరప్పుతోడ"

అని సరియైన పాఠము §

## 50. 'అరేఁడు'

"నృప కుంజరు చేత నరేంద్ర సారఁటి" (1. 50)

అని, పూ. పా.- "నరేఁడు సారఁటి" అని, శా. పా.— 'నరేంద్ర' పాఠము తప్పు. 'అరేడు' పాఠమే ఒప్పు. కాని, శాస్త్రిగారు, 'అరేఁడు' అని అరసున్నతో ముద్రించినారు.— "అరేఁటి యన్న యా మాత్యమణి" (4. 1) అన్నచోట గూడా 'రేఁటి' అని, అరసున్న పెట్టియే యున్నారు.

'అరేడు', 'కరేడు' అన్నట్లు గ్రామ నామము. ఆ పదములలోని 'రేడు', బంగారులోని 'గారు' వంటిది. 'ఱేఁడు'లో ఉన్నదిగదా యని, అరేడు-లోను అరసున్న లుంచుట సరి కాదు.

---

§ ఈ 49 మొదలు 52 వరకును గల పాఠములను గూర్చిన చర్చ, శ్రీ నిడదవోలు వేంకటరావు పంతులుగారి "భాషా పరిశోధన" వ్యాసములో నున్నది. వివరము లందు తెలియనగును.

## '51. బలిమి వాటించి'

"యవన కర్ణాట కటక ఘూర్జరుల తోడ
బలిమి వాటించి యేలించెఁ దెలుఁగు భూమి" (1. 63);

అని, పూ. పా.— "బలిమి వాదించి" అని, శా. పా.— రెండును తప్పే. "చెలిమి వాటించి" అని సరియైన పాఠము.

## 52. 'జాదుర జాదుర'

"జాదుర జాదురంబు మృదు చర్చరి గీతులు...దక్షవాటికా
వేదుల మీఁదటఁ" (5. 103)

అని, పూ. పా.—

"జాదుర జాదురం చు మృదు చర్చర... వేదుల మీఁదటఁ"

అని, శా. పా.—

ఈ రెండును అప పాఠములే. "జాగర జాగరంచు...చర్చరి గీతులు...దక్షవాటిలో, వీదుల వీదులఁ" అని సరియైన పాఠము,

ఈ తరగతికి చేరిన దోషము లింకను చాల గలవు. ఇవి యిట్లుండగా, క్రొత్తపల్లి వారి ప్రతిలోను, చిలుకూరి వారి ప్రతిలోను గూడా,— గణ యతి ప్రాసములు చెడిన పాఠములును ఉన్నవి. వాటిని గూడా చూపించు చున్నాను.

## 53. 'దాన విశ్రాణనములు'

"శ్రాద్ధ పిండోదకాది విశ్రాణనముల" (3. 117)

అని, పూ. పా.—

"శ్రాద్ధ పిండోదకాది దాన విశ్రాణనముల"

అని, శా. పా.— ఇందు 'దాన' పద మధికము. అందువలన గణ భంగము.

## 54. 'కపర్ది జటా'

"త్రపుసీ కుసుమా భరణా!
కపర్ది జటా జూట కోటి ఘటిత శశాంకా! (6. 47)

రెండు ప్రతులలోను ఇదే పాఠము. రెండవ పాఠమున మాత్రాధిక్యము. తన్మూలమున గణ భంగము. కవి పాఠ మిదే యగునా?

సూ. ని. లో 'త్రపుషి' యను రూప మున్నది. 'తపుసి' లేదు. 'త్రపుస' యున్నది. 'త్రపుసా' శబ్దమును శ్రీనాథుడు,-

"త్రపుస పుష్పలతా మతల్లి పటోలికా" (2. 56)

అని, అకారాంతముగా ప్రయోగించినాడు. భీమ ఖండమున ఇట్టి విశేషములు చాల గలవు. ఇది విషయాంతరము.

## 55. 'హాహూక' - 'వాటికిన్'

"ఏదెసఁ జూచిన న్నవ మహేశ్వర మూర్తులు శ్రీ నిశుంభ కుం
భోదర తండు భృంగిరిటి హూహూక హాహులు దక్ష వాటికన్"

ఇది, పూ. పా.- (1. 104)

'కుం, భోదర తండు భృంగిరిటి హాహూక హూహులు దక్షవాటికిన్'

అని, శా. పా.- ఈ పాఠమున యతి భంగము.

"దక్షవాటికిన్" అనుటయును తప్పే.- 'దక్షవాటికన్' అనుటయే ఒప్పు.

దక్షవాటికన్ = దక్షవాటిక యందు, ఏదెసఁ జూచినన్ = ఎక్కడ చూచినను, నవమహేశ్వర మూర్తులు- ఇత్యాదిగా సమన్వయము.

## 56. 'పుష్పచాప' - 'పుష్పబాణ'

"సంగమంబున గంధసార కుంకుమ చంద్ర
జంబాలమునఁ బుష్పచాప మథను" (4. 103)

అని, పూ. పా.—

"జంబాలమునఁ బుష్పబాణ హరుని"

అని, శా. పా.- ఈ పాఠమున యతి భంగము.

వారు "పుష్పచాప మథను" అను పాఠమును నిరసించి, క్రిందికి నెట్టి, "పుష్పబాణ హరుని" అను పాఠమును గౌరవించి, పైకెక్కించినారు. అందువలన లక్షణము చెడుట తప్ప ఒరిగిన దేమీలేదు.

## 57. 'యువనాశ్వుఁడు'

"ఒకవేళ ధరియించు యువనాశ్వుఁ డిచ్చిన" (1.117)

అని, పూ. పా. – "యవనాశ్వుఁ డిచ్చిన" అని, శా. పా.– శాస్త్రిగారి పాఠమున యతి భంగము.

## 58. 'నిత్రుపాసెము'

"శిష్యులును నేను నిత్రుపాసెంబు వడితి,మి' (2. 100)

అని, పూ. పా.– వేదం – పండితులును, 'ఆముక్త' పీఠిక (పు. 186)లో, ఈ పాఠమునే ఉదాహరించి యున్నారు.

కాని, 'నత్రుపాసెము' అను రూపము తప్పు. 'నిత్రుపాసము' అని సరియైన రూపము. అందు కీ క్రింది యతిస్థాన ప్రయోగము ప్రమాణము.

"సతతంబు నిత్రుపాసములతో నత్యుగ్ర
తపము గావించుచుఁ దానమాడ" (వరాహ. 7. 73)

కాబట్టి 'నిత్రుపాసెము'ను, 'నిత్రుపాసము'గా సవరింపక తప్పదు. ఈ సవరణతో, పద్యపాదము,–

"శిష్యులును నేను నిత్రుపాసంబు"

అను రూపమును పొందుటయు, యతి చెడుటయు తటస్థించును. అందువలన పూర్వ ముద్రణ పాఠమే తప్పని స్పష్టముగా నేర్పడుచున్నది. ఈ విషయమును గమనింపక 'చిలుకూరి' వారు, తమ ప్రతిలో,–

"శిష్యులును నేను నిత్రుపాసంబు వడితి,మి"

అనియే ముద్రించినారు. ఈ పాఠమున ఛందో దోషమున్నూ, పూర్వ పాఠమున అపశబ్ద దోషమున్నూ ఉన్నవి. ఈ పాఠము బాగుపడ వలెనంటే, 'శిష్యులు' అను పదమునకు మారుగా 'ఛాత్రు'లను పదమును చేర్పవలెను. అప్పుడు,

'ఛాత్రులును నేను నిత్రుపాసంబు వడితి,మి'

అని, శ్రీనాథుని రచన సలక్షణ మగును.

## 59. 'పరమ' – 'చరమ'

"పరమ సంధ్యాగమంబునఁ బటహశంఖ
ఝల్లరీ మడ్డు డమరు ఝర్ఝరుల మ్రోఁత" (4. 103)

అని, పూ. పా.— ఇందలి 'పరమ సంధ్య'కు, సాయం సంధ్య — అని అర్థము కావలె. అగునా? అని సందేహము [illegible]

"పరమమ్ = Last" అని యున్నది. దానిని బట్టి, పరమ సంధ్య = చరమ సంధ్య – యని చెప్పికోవచ్చును. లేనిచో అర్థము సరిపడదు.

ఇంత అవస్థ యెందుకని కాబోలు, శాస్త్రిగారు 'పరమ' ను- 'చరమ'గా మార్చి,-

"చరమ సంధ్యాగమంబునఁ బటహాశంఖ"

అని, ముద్రించినారు. కాని యతి చెడిన సంగతి వారి మతికి రాలేదు. 'పరమ' ను, 'చరమ'గా సవరించినట్లే, 'పటహాశంఖ' అను పాఠమును 'శంఖపటహా' అని సవరించి యున్నచో-

'చరమ సంధ్యాగమంబున శంఖపటహా'

అని, పాఠము నిరాక్షేపముగా కుదిరి యుండెడిది. మొత్తము మీద ఈ పాఠమింకను విచారింప వలసినదిగానే యున్నది. పరమ శబ్దమునకు 'చరమము' అనునర్థమున్నచో- పూర్వపాఠమే యుండవచ్చును. ఇది పండితులు తేల్పవలసిన విషయము.

## 60. 'బంగారమున'

'మలిపించె బంగారముల దేవగృహములు' (5. 88)

అని పూ. పా.

'బంగారమున' అని శా. పా. పూర్వపాఠమున ప్రాసయతి. శాస్త్రి గారి పాఠమున యతి యెగిరి పోయినది. 'బంగారముల' అని బహువచనముగా చెప్పుట తప్పని అట్లు మార్చిరేమో! తప్పయినను, మార్చి ఛందోభంగము చేయగూడదు గదా! అసలు 'బంగారములు' అనుటలో తప్పు లేదు. (వివరములకు నా 'సాహిత్య సమీక్ష'—పు. 4. చూచునది)

ఈ ఛందో దోషములతో పాటు, పరిష్కరణములో, వ్యాకరణ దోషములును సందుకొన్నవి. అవియును కొన్ని చూపించెదను.

## 61. 'క్ష్మాజ'

'భీమనాథుండు, ఘనపాలి కల్పక క్ష్మాజ మయ్యె'(8 216)

అని, పూ. పా.—

శాస్త్రిగారు, 'మనపాలి కల్ప వృక్షంబు సువ్వె' అను పాఠ మొకటి అడుగున చూపించి, గ్రంథములో,—

'మన పాలి కల్పక ఝ్మాజ సువ్వే'

అను పాఠమును చేర్చినారు. వారడుగున జూపిన పాఠములో యతి చెడియున్నది. వారు పద్యమున జేర్చిన పాఠములో యతి కుదిరినదిగాని, 'ఝ్మాజ' యను అపశబ్దమున్నది.

ఝ్మాజ-వృక్ష శబ్దములు, అకారాంత పుంలింగములు గాని, ఆకారాంత స్త్రీలింగములు కావు. అవి తత్సమము లైనప్పుడు, ఝ్మాజము; వృక్షము-అగును గాని, 'ఝ్మాజ'; 'వృక్ష' కావు. (చూ. బాల. తత్సమ. 39) 'రాముడు మాపాలి కల్ప వృక్ష' యనుట తప్పు. 'భీమనాధుడు మన పాలి కల్ప కఝ్మాజ' యనుటయునట్టిదే.

'సువ్వే' అను అంత్యప్రాస నియమము కొరకు 'ఝ్మాజము' ను, 'ఝ్మాజ'గా మార్చి, మహాకవి రచనను అపశబ్ద భాజనము చేయుట అపచారము. అంత్య ప్రాసాదులు కవి విధేయాధీనములు. అందొకటి తప్పినంత మాత్రమున రచన దుష్టము కాదు. అపశబ్దముచేత రచన దుష్టమగును.

కాబట్టి, 'ఝ్మాజ సువ్వే' అను పాఠము పరిత్యాజ్యము, 'మనపాలి కల్పక ఝ్మాజమయ్యో' అను పూర్వపాఠమే పరిగ్రాహ్యము. 'సువ్వే' అను అంత్యప్రాసమును నిల్పగల పాఠమున్న దేమో చూడవలె.

## 62. 'వాయురాకాశములు'

'పృథివ్యాపస్తేజో వాయురాకాశంబులు' (5. 183)

అని, రెండు ప్రతులలోను పాఠము.—

సమాసమున, 'వాయు + ఆకాశము = వాయ్వాకాశములు' అగును; 'వాయురాకాశములు'-అనుట తప్పు.

## 63. 'సప్తగోదావరి'

'సప్తగోదావర జలతరంగారోహ, కేళీ' (1. 98)

అని, పూ. పా.— 'సప్తగోదావరీ జల...' అని, శా. పా.—

'సప్తగోదావరి' యనుట తప్పు. 'సప్తగోదావరము.' అనవలెను. సప్తానాం గోదావరీణాం సమాహారః సప్తగోదావరమ్. అవ్యయీ భావము. శ్రీనాథుడు 'సప్తగోదావరీ, శబ్దము నెక్కడను వాడలేదు. సప్తగోదావర శబ్దమునే సర్వత్రవాడినాడు.

'సప్తగోదావరోత్సంగ జయ మహేశ' (3. 191)
'విమల మతి సప్తగోదావరమునఁ గ్రుంకి' (4. 20)
'తరమె వర్ణింప సప్తగోదావరంబు' (4. 41)

## 64. 'లెస్సఁగాఁగ'

'లింగముల లెస్సగాఁగఁ గల్పించి భక్తి' (5. 149)

అని, పూ.పా.– "లెస్సఁగాఁగ" 'అని, శా.పా. వారు, 2.73. లోను, 'కడు లెస్సఁగఁగూరిమి' అనియే ముద్రించినారు.

'లెస్స' కళ. కావున 'లెస్సఁగాఁగ' అని సవరించుట సరిగాదు.

## 65. 'వేఁగ్రైకొమ్ము'

'ఇచ్చెదన్ వరము వేక్రైకొమ్ము' (6. 67)
అని, పూ. పా.– 'వేఁగ్రైకొమ్ము' అని, శా. పా.–
'వే', కళ. ద్రుతప్రకృతికము కాదు.–
'వే చని యిచటికిఁ గొనిరమ్మా చూతము' (విరాట. 2. 89)
కావున పూర్వపాఠమే సరియైనది.

## 66. 'పదునాల్గురు'

'మనువులు పదునాల్గురును యదాజ్ఞాయుక్త' (3. 205)

అని, పూ. పా.– అట్లే శాస్త్రిగారును 'పదునాల్గురును' అనియే ముద్రించినారు.

మహన్మహ త్వర్థక బహువచనమున, 'నలుగురు'; 'పదునలుగురు', అనవలెగాని, నాలుగురు; పదునాలుగురు, అనరాదు. శ్రీనాథుడట్లని యుండడు. ఆయన రచన 'మనువులు పదునల్గురును' అనియే యుండును.

## 67. 'కడుతురు'

పూర్వప్రతిలో,–' అఖిలభవాంభోధిఁ గడుతు రంబుజవదనా' (5.172) అని యున్నది. అట్లే శాస్త్రిగారును 'కడుతు' రనియే ముద్రించినారు.

ధాతువు 'కడచు' గాని, 'కడుచు' గాదు. కనుక 'కడతు రంబుజ వదనా' అని యుండవలెను.

## 68. 'శనగలు'

'మినుములు సెనగలును బండు' (5. 68)

అని, పూ. పా.—'శనగలును' అని, శా. పా.—

అచ్చతెనుగున శవర్ణములేదు. కనుక 'శనగ' లనుట తప్పు. 'సనగ' లన వలెను. 'సనగ' చణక శబ్దభవము. 'సెనగ' లనవచ్చు. 'సనగ' కు 'సెనగ' రూపాంతరము.

'సనగ' వాడుకలో లేదుగాని, గ్రంథములలో నున్నది. ఒక్క ఉదాహారణము —

ద్విపద.—'సనగసొంపు జూపింగె సమసె బొబ్బరలు' (విష్ణుమాయా. పూ, 3. ఆ.) శ, ర.— పూర్వపాఠమొప్పనియు, శాస్త్రిగారి పాఠము తప్పనియు, ఇక్కడ ఫలితాంశము.

## 69. 'బచ్చన'

'లచ్చి చనుదోయి కుఙ్కుమ బచ్చనయుగ' (4. 127)

అని, రెండు ప్రతులలోను-పా.—'బచ్చన' యనుట తప్పు. తెనుగున తాలవ్యచకారము ఇ, ఈ, ఎ, ఏలను గూడియే యుండును. కావున 'బచ్చెన' అని యుండవలెను.

'బచ్చెనయుగ' అనియేపాఠము. (చూ. శ. ర. లో 'బచ్చెన')

## 70. మచ్చకంటి

'ఒక్కయింటి మచ్చకంటి' (2.110)

'అమ్మచ్చకంటి' (2.125)

అని, పూ. పా.- పై రెండు తావులలోను, శాస్త్రిగారును, 'మచ్చకంటి' అనియే అన్నారు.

'మచ్చకంటి'-యనగా, కంటిలో మచ్చగలస్త్రీ-యని యర్థమగును. మచ్చెకంటి'-యనవలెను. (మచ్చెము=కన్ను) చేపలవంటి కన్నులుగలది. యని యర్థము. (చూ. శ. ర.)

'బచ్చన'లోని తప్పెట్టిదో, 'మచ్చకంటి'లోని తప్పును అట్టిదే.

## ముగింపు

ఇప్పటికే వ్యాసము చాల దీర్ఘమైనది. కావున, ఒక్కమాట మనవి చేసి యీ వ్యాసము నింతటితో ముగించెదను.

భీమఖండము – అచ్చుప్రతులు రెండును – అపపాఠములతో నిండి యున్నవి, అరవై యేండ్లక్రిందటి పద్మనాభ శాస్త్రిగారి పరిష్కరణము వలెనే, ఈనాటి పాపయ్య శాస్త్రిగారి పరిష్కరణమును అందదుకులుగనే యున్నది. దానికి కారణము పరిశీలన లోపమేగాని, పాండిత్యలోపము కాదు.

వారివీరి సవరణల వలన మారురూపు పడియున్న యీ భీమఖండకృతిని ప్రతిపదమును పరిశీలించి సరిపరచవలెనంటే, అథమపక్షము ఆరునెలలైనను తీవ్రపరిశ్రమ చేయవలె. కొంత ధనమును గూడా వెచ్చించవలె. అట్టి పరిశ్రమకు పూనుకొన్న పండితునకు కూలిపాటు గిట్టదు. పరిష్కర్త కష్టమును గమనించి, ప్రతిఫలము ముట్టజెప్పు ప్రకటన కర్తలు లేరు. అందువల్లనే యీ నాటి పరిష్కరణము ఈ స్థితిలో నున్నవి.

గ్రంథ ప్రకాశకులు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారు, తమ 'విజ్ఞప్తి'లో,– 'మన ప్రాచీనాంధ్ర గ్రంథములలో ప్రధానములైనవికొన్ని, పాఠభేదములు సరిచూపించి ప్రకటించవలెనని మాకు మిక్కిలి యభిలాష యున్నది' అని తెల్పియున్నారు. అట్టి పవిత్రసంకల్పము గ్రంథప్రకాశకుల కుదయించుట ఆంధ్రభారతి యదృష్టము. తమకట్టి యభిలాష యున్నది గావున శ్రీ రావుగారు, భీమఖండము మూలమును, వ్రాతప్రతులను తల స్పర్శముగా పరిశీలించియున్న శ్రీ శాస్త్రిగారికి తగిన ప్రోత్సాహమొసగి, మరల వారిచేతనే ఆ గ్రంథమును పరిష్కరింపించి, తాము ప్రకటించి, శ్రీనాథమహాకవి యాశీస్సులకును, ప్రాచీన కావ్యప్రియుల యభినందనములకును పాత్రులు కావలెనని నేను కోరుచున్నాను.

మరియొక ముఖ్య విషయము: వారి యీ ప్రతిలో విషయ సూచిక లేదు. అది లేకపోవుట పెద్దలోపము. ఈ సారి ముద్రణమున ఆ లోపమును తొలగించుట అవశ్యకర్తవ్యము.



కవిత :

# పదునాల్గు

— శ్రీ బోయి భీమన్న

( దేశానికి పారతంత్ర్యం తొలగింది పదునాల్గవ **తేదీతో.** పూర్వం లోకానికి నరకాసురుని ఉపద్రవం తొలగిందికూడ పదునాల్గవ తిదినాడు, అంటే చతుర్దశి నాడు. అప్పుడు ఆ మరునాడు దీపావళి. ఇప్పుడు ఈ మరు నాడు, అంటే రేపు 15వ తేదీన, స్వాతంత్ర్య దినోత్సవ **దీపావళి.** ఇదీ పదునాల్గు ప్రాధాన్యత. )

పదునాల్గవ తిథియే - నర
క దైత్యు చెరబాపె; శ్వేత ఘాతుక మణచెన్
పదునాల్గవ తేదీయే;
ముదితా ! పదునాలుగెంత పుణ్యాత్మకమో !

ఆ యుగమందు ఒక్కని అ
హంకృతిపై అది గెల్పు ధాత్రికిన్,
ఈ యుగమందు సప్తహరు
దే భటుడై ప్రహరా యొసంగు ఆం
గ్లేయ జిఘత్సపైని ఇది
గెల్పు, మహాత్ముడు కృష్ణుడందుమా ?
ఆయన దీప; మీయన స
హస్ర సహస్ర కరార్చితార్చదే.

నాడు జగదుపద్రవ కరాంధతమ మడగ
దీపములు మేలుకొనియె ప్రతీ గృహమున,
నేడు మానవ దాస్యోగ్ర నిరయ మడగ
ఆత్మములె మేలుకొనె నంతరాత్మలందు

విమలాబ్దమ్ములు మూకి, భంగములతో
పెచ్చిల్లుచున్ పర్వత
త్తు మహోత్సమ్ముల నడ్డి, వీటి పొలముల్
దున్నించి, సౌదమనీ
రమణుల్ దీపములుంచ, భారతము నా
రాధింపగా వచ్చె, కాం
చు మవే నవ్య ప్రణాళికల్, హిమగిరిం
ద్రుండిచ్చు శ్రీ మాలికల్ !

పదునాల్గు భువనముల నీ
పదునాల్గుకు సాటిలేదు, భరతావనికిన్
పదునిడిన చరిత దీనిది
పద ముందుకు, ప్రగతి పనుల పాల్గొంద మికన్ !

( ఆకాశవాణి కవి సమ్మేళనం, 14-9-60 )



శ్రవ్య నాటిక :

# లలిత

—శ్రీ డి. రామలింగం

(గత సంచిక తరువాయి)

లలిత : బావా, నువ్వు అచ్చు అత్తయ్య పోలికే. ఆమె కంఠం కూడా నీ అంత మధురంగా ఉండేదా బావా ?

రాజు : ఎన్నో రెట్లు మధురంగా ఉండేది లలితా. ఈ పెట్టెను మా అమ్మ నా కిచ్చి పోయింది. దీన్ని అమ్మి ఆమె పవిత్రాత్మకు బాధ కలిగించడం నా కిష్టం లేదు. ఇది పవిత్రమైన నిక్షేపం. నీకు అప్పగిస్తున్నాను దీనిని.

లలిత : అ—లాగే బావా. నా ప్రాణంతో సమానంగా చూచుకుంటాను. మరి ఈ సొమ్ము తీసుకుంటావా.

రాజు : అలాగే లలితా. మేము దివాలా తీసినా నువ్వయినా అప్యాయంగా చూస్తున్నావు.

లలిత : అలా అనకు బావా. ఎవరైనా ఒకరికి దేవుడు ఐశ్వర్యం ఇచ్చాడు. అది మనిద్దరిదీ ... చెప్పు బావా, నేనంటే నీ కిష్టమేనా.

రాజు : నీవంటే ఇష్టమైనవాళ్లు నాకి ప్రపంచంలో ఎవ రున్నారు లలితా.

లలిత : నన్ను ప్రేమిస్తున్నావా బావా.

రాజు : ప్రేమా ! లలితా, నువ్వు నన్ను...

లలిత : అవును బావా, నన్ను ప్రేమిస్తున్నానని చెప్పు.

రాజు : ఎలా చెప్పాలో నాకు మాటలు రావడంలేదు లలితా.

లలిత : ఆ మాత్రం చాలు బావా. ఇక నువ్వు తిరిగి వచ్చిందాకా నీకోసం నిరీక్షిస్తూ ఉంటాను. చేతిలో చేయి వెయ్యి బావా. నన్ను పెళ్లాడతానని.

రాజా : తప్పకుండా లలితా.

లలిత : అబ్బ, నా హృదయం ఎంత తేలిగ్గా ఉందో నీకెలా చెప్పను బావా. జీవితంలో ఈనాడు నేను ఆనందం అనుభవిస్తున్నాను. నిశిరాత్రి కూడా ఒక్కొక్కళ్ళకు ఆనందమిస్తుంది. తెల్లవార వస్తూంది బావా. ఉదయమే కదూ నువ్వు వెళ్లేది.

రాజా : అవును లలితా, మన ఎడబాటువేళ సమీపిస్తోంది. ఇదిగో ఈ ఉంగరం నీ దగ్గిర ఉంచు లలితా. ఇవి మా అమ్మ రవ్వల దుద్దులు.

లలిత : అలాగే బావా, వీటిని కూడా నిక్షేపంగా చూచుకుంటాను. ఇక మనం వెడదాం బావా. తెల్లవారుతూంది.

రాజా : అలాగే.

* * *

రంగ : అయ్యో! లింగరాజుగారూ, నన్ను పిలిచారట.

లింగ : ఆఁ, ఆఁ, మీకోసమే చూస్తున్నా. మీతో సంప్రదించాలండీ.

రంగ : అంతకంటేనా, సంగతేమిటో చెప్పండి.

లింగ : చూడండీ, మా బావమరది సంగతి మీ కిపాటికి తెలిసే ఉంటుంది. మా మేనల్లుడు ఇవ్వాళే బొంబాయి వెళ్లి పొయ్యాడు, మీరు శ్రమ అనుకోకుండా హైదరాబాదు వెళ్లి అప్పులు ఎన్నో, ఆస్తులెన్నో విచారించి వ్యవహారం చక్క బెట్టుకు రావాలి.

రంగ : ఈ మాట నేనే మీతో చెబుదా మనుకుంటున్నాను, ఎంతయినా మీ తోబుట్టువు భర్త. ఆయనకు అపకీర్తి వచ్చిందంటే మీకూ అంటుతుందది.

లింగ : అదే అంటున్నా రంతా.

రంగ : కనక దివాలా కాదూ అని అనిపించాలి.

లింగ : అదెట్లా ?

రంగ : నే చెబుతాగా. ఆయనగారికి లిమిటెడ్ కంపెనీ లేవో కొన్ని ఉన్నట్టున్నాయి. వాటి లిక్విడేషన్ పెడితే కొన్ని తఫిసీళ్లు బైటపడొచ్చు. ఆ తర్వాత వకీళ్లను పెట్టి వ్యవహారం నడుపుదాం.

లింగ : చూడండి, ఈ వ్యవహారంలో మనకేమైనా గిట్టుబాటు ఉంటుందంటారా.

రంగ : ప్రయత్నం దానికోసమేనండీ. అదంతా నా నెత్తిమీద పెట్టండి.

లింగ : అలాగే.

రంగ : ఆఁ చెప్పడం మరిచాను, శారీలకు అకస్మాత్తుగా రేటు పెరిగిందని పత్రికల ఘోగట్టా. డబ్బు చేసుకోవాలనుకుంటే...

లింగ : చెప్పరేం, ఇంటో ఊరికే మూలుగుతూ ఉంటే.

రంగ : క్యాషు దండిగా ఉంటే చక్కెర ఫ్యాక్టరీ వాటాలు కొనడం ఇప్పటికి లాభకరం.

లింగ : ఐతే కాస్త కూర్చోండి. వెరసి మొత్తం ఎన్ని ఉన్నాయో చూస్తా.

రంగ : అలాగే.

( క్షణం విరామం )

లింగ : అమ్మాయ్, లలితా.

లలిత : ఏమిటి నాన్నా.

లింగ : నీ దగ్గర శారీలన్నీ నాకివ్వాలమ్మా.

లలిత : నాదగ్గ రెన్ని ఉన్నాయి నాన్నా.

లింగ : చిల్లర శ్రీ మహాలక్ష్మి కదమ్మా. చూడూ, మంచి బేరము ఒకటొచ్చింది. నా తల్లివి కదూ. మళ్లీ నీవి నీకిస్తాలే. ఇలాతే అమ్మా.

ధన : దాని శారీలు మీకెందుకండీ.

లింగ : ఉండవే వెర్రిమొహమా. త్వరగా రా అమ్మా.

లలిత : నా దగ్గరిప్పుడు శారీలు లేవు నాన్నా.

లింగ : లేవూ, ఏమైపొయ్యాయి !

లలిత : అన్నీ అయిపొయ్యాయి.

లింగ : ఏమయ్యాయీ అంటా.

ధన : ఏమండీ, ఆడపిల్లనలా పత్తిడి చెయ్యకండీ.

లింగ : దొత్తేరి, నువ్వలా ఉండు. ఆడమూకంతా చేరి నా ఇల్లు గుల్ల జేస్తున్నారు.

లక్ష్మి : బాబయ్యా, అమ్మగారి కసలు వంటో బాగోలేదు. అలా కోప్పడకండి.

లింగ : లక్ష్మి, నువ్వు నోరుమూసుకుని అవతలికెళ్లు. ఇక చెప్పమ్మాయి, శారీ లేమయ్యాయి !

లలిత : నాకిచ్చినవి నా ఇష్టప్రకారం చేసుకోడానికి వీల్లేదా నాన్నా.

లింగ : ఇలా అయితే నీ కిక చిల్లిగవ్వ ఇవ్వను. సొమ్మొక్కడున్నా ఒకటేనని ఇచ్చానుగాని పోగొట్టడానికా.

లలిత : నేనేమీ పోగొట్టలేదు. ఎవరికి చెందాలో వాళ్లకే చెందింది.

లింగ : ఎవ్వరికీ అంట ?

లలిత : అది నా రహస్యం. నే చెప్పను.

లింగ : ఇంటి యజమానికి తెలియనక్కరలేదా ?

లలిత : అది నా సొంత విషయం నాన్నా.

లింగ : ఏమిటీ ?

లలిత : నాకిచ్చిన వాటిని నా ఇష్టప్రకారం ఖర్చుపెట్టే స్వాతంత్రం లేదా ?

లింగ : ఆఁ !

ధన : అవును, దానిసొమ్మది. నీళ్లల్లో పారేసుకుంటుంది. మీకెందుకు ?

లింగ : ఓసి వెర్రికుట్టా. నిన్నెవ్వరూ అడగలేదు స్వాతంత్ర్యం. నిన్న గాక మొన్న పుట్టి దానివి. నీ ఇష్టమొచ్చినట్టు అడిదా మనుకున్నావ్.

లలిత : నేను చిన్న పిల్లనేం కాను. యుక్తవయస్సు వొచ్చిందాన్ని.

లింగ : ఇంకేం, ఆ మాటు వెధవాయికే ఇచ్చి ఉంటావు. వెధవ, ఆ తండ్రికి కొడుకు కదూ. ఏరుదాటిన తరువాత తెప్పతగలేసే రకం. వాడు నీ మొహం చూస్తాడా. వెధవాయి, ఆ ఆషాఢభూతివొచ్చి నప్పటినుంచీ ఈ కొంపంతా కంగాళీ అయిపోయింది

ధన : ఏమిటండీ ఆ మాటలు.

లింగ : నువ్వు నోరుమూసుకు పడుండు. ఎంత పని జరిగిందీ. ఎన్నడైనా లింగరాజు వంశంలో బంగారమిలా మాయ

| | |
|---|---|
| | మైందా. వెళ్లు. నువ్వు నా కూతురివి కావు. లక్ష్మీ. లక్ష్మి. |
| లక్ష్మి : | ఏం బాబయ్యా. |
| లింగ : | దీన్ని మేడగదిలో వేసి తాళంపెట్టి రోజుకో పూట ఇంత అన్నం పడెయ్యి. |
| ధన : | ఏయ్ లక్ష్మి. |
| లింగ : | ఏదీ దీని పెట్టె — ఆఁ! ఎక్కడిదీ బంగారపుపెట్టె. ఆ వెధవాయిదేనా. పరవాలేదు. పోయిన సొమ్ముకు కొంత వచ్చింది. |
| లలిత : | నాన్నా. దాన్ని ముట్టుకున్నావంటే ఇక్కడే ప్రాణం విడుస్తా. అది మీది కాదు. పవిత్రమైన నిక్షేపం. దాన్ని అంటుకోబోకు. |
| లింగ : | నీ బెదిరింపులకు జంకుతాననుకున్నావా. |
| ధన : | ఏమండీ మిమ్మల్నే. |
| లక్ష్మి : | అయ్యో. అయ్యో అమ్మగారు పడిపొయ్యారు. |
| లింగ : | ఆఁ! ఆఁ!... (విషాద సూచక వయొలిన్ వాద్యం) |
| లలిత : | అమ్మా, అమ్మా, నన్నొదిలిపెట్టి వెళ్లావా. నాకు దిక్కేవరమ్మా. ఇటు చూడమ్మా. (ఏడుస్తుంది) |
| లింగ : | ధనం, ఇటు చూడు ధనం. నాకేసి చూడు. ఇక నీ కూతుర్ని ఏమీ అనను. శారీలు అడగను. నువ్వి ఇంట్లో తిరుగుతూ ఉంటే నాకదే చాలు. ఇవిగో నీకు వంద శారీలిస్తున్నా. |
| | (శారీల మోత) |
| | ఇటు చూడు. అమ్మాయికి మరో రెండువంద లిస్తున్నా. ఏమైనా చేసుకోండి. చూడు ధనం. శారీలు (చప్పుడు) |
| లక్ష్మి : | అమ్మా, బాబయ్యగారు పిలుస్తున్నారమ్మా. చిన్నమ్మగార్ని ఏమీ అనరట. కళ్లు తెరవండమ్మా. |
| లలిత : | అమ్మా, అమ్మా, నన్ను చూడమ్మా |
| రంగ : | (వస్తూ) ఏమిటో అఘాయిత్యం జరిగినట్టుందే. |
| లింగ : | అవును రంగనాథంగారూ, అంతా మా కర్మ |

రంగ : లాభంలేదు. అంతా అయిపోయింది.

లలిత : (ఒక్క పెట్టున) అమ్మా!

రంగ : లింగరాజుగారూ, ఎన్నడూ లేదు. తొందరపడ్డారు. అసలే జబ్బు మనిషికదా.

లింగ : మాఇంటి ధనలక్ష్మి పోయిందా.

రంగ : అధైర్యపడకండి. ఏనాటికేది ప్రాప్తమో ఎవరు చెప్పగలరు.

లింగ : రంగనాథంగారూ, సొమ్ముపోయి శనీ పట్టె నన్నట్లుంది మా గోడు.

రంగ : ఇటురండీ, ఒకమాట.

లింగ : ఏమిటి ?

రంగ : (నెమ్మదిగా) సొమ్ముదగ్గర కాస్త పట్టువిడుపు లుండాలండీ. ఎంతపని జరిగిందో చూశారా. అటు ఇంటికైన ఇల్లాలూ పోయింది. ఇటు మరో చిక్కుకూడా వచ్చింది.

లింగ : ఏమిటది ?

రంగ : మీ ఆవిడకు పుట్టింటి వారి తాలూకు ఆస్తి ఉంది కదూ.

లింగ : అయితే ?

రంగ : అది ఆమె హక్కు భుక్తంలోనే వుంది కదండీ.

లింగ : అవునూ.

రంగ : అదంతా పిలునామాలో మీ కూతురు లలిత పేర ఉంది.

లింగ : ఆఁ! ఆ సంగతే గుర్తులేదు నాకు.

రంగ : ఇప్పు డా పిల్ల తన ఆస్తి తనదేనని స్వతంత్రంగా వ్యవహరిస్తే ఆస్తి పంచివ్వాల్సి వొస్తుంది.

లింగ : ఆఁ! ఆస్తే!

రంగ : వ్యవహార సరళి చెబుతున్నానండీ. న్యాయశాస్త్ర ప్రకారం ఆ అమ్మాయికా హక్కుంది. అందులోనూ యుక్తవయస్సు కొచ్చినపిల్ల. తన తల్లి పుట్టింటివారి ఆస్తి అంటుంది. ఏం చేస్తా రప్పుడు.

లింగ : ఎంతపని జరిగింది రంగనాథంగారూ.

రంగ : ఔనా. అయిందేదో అయింది. ముందు విధి నిర్వహణ కానివ్వండి. ఆ తరువాత మాట్లాడుకుందాం.

(విషాదంగా వయొలిన్ వాయిద్యం)

రంగ : (దూరం నుంచి) అయ్యా, లింగరాజుగారూ,

లక్ష్మి : బాబయ్యగారికి వంట్లో బాగాలేదు. పైన ఉన్నారు వెళ్ళండి.

రంగ : వంట్లో బాగాలేదూ. అందుకే లోభికి మూటనష్టమన్నారు. ఇంత ఆస్తిపరుడు, ఆ కాస్త బంగారానికి లోభించి దురదృష్టం కొని తెచ్చుకున్నాడు.

లక్ష్మి : అయ్యగారు ఒకరు చెబితే వింటారా బాబో.

రంగ : సరే నీపని నువ్వు చూసుకో. అయ్యగారు ఇనప్పెట్టి గదిలో నేనా ఉందీ.

లక్ష్మి : అక్కడే మంచంలో పడుకున్నారు, వెళ్ళండి.

రంగ : లింగరాజుగారూ.

లింగ : (హీనస్వరంగా) రంగనాథంగారా ?

రంగ ; అవునండీ.

లింగ : లోపలికి రండి.

రంగ : వంట్లో బాగాలేదని విన్నాను.

లింగ : ఇల్లాలే పోయిన తరువాత ఇంటి కళే పోయింది.

రంగ : గడచినదానికి విచారించకండి. ఆనందస్వామిగారన్నట్లు మనిషి చూపు ఎప్పుడూ ముందుకే ఉండాలి.

లింగ : స్వాములవారీమధ్య రావడమే మానేశారు.

రంగ : ఆశ్రమానికి చందాలకోసం దేశసంచారం చేస్తున్నారట.

లింగ : ఏమో.

రంగ : హైదరాబాదు వ్యవహారం చక్కబెట్టుకొచ్చాను. చాలా కంపెనీలు లిక్విడేట్ అయ్యాయి. ఇంకా అక్కడక్కడా కొన్ని పద్దులున్నాయని తెలిసిందిగాని వాళ్లెవరూ క్లెయిమ్సుదాఖలు చెయ్యలేదు.

లింగ : ఆ గొడవ మనకొద్దు, అమ్మాయి వ్యవహారం ఏమిచేశారో చెప్పండి.

రంగ : అదీ సెటల్ చేశానండీ వాళ్లమ్మ ఆస్తినంతా మీకు దఖలు చేస్తూ తనహక్కులు వదులుకుంటూ దస్తావేజుపై సంతకం పెట్టింది. ఇవాళే రిజిసరు చేయిసాను

లింగ : నాతల్లి! మళ్లీ ఈ సంసారం కుదుటపడుతూ ఉంది రంగ నాధంగారూ.

రంగ : మరే మరో శుభవార్త విన్నారా.

లింగ : ఏమిటది ?

రంగ : మా అబ్బాయి శేఖరానికి మునసబీ ఉద్యోగం అయిందండీ.

లింగ : కావలసినవాడు,

రంగ : మరి వాణ్ణి ఒక ఇంటివాణ్ణి చేసే భారం మీది.

లింగ : అంటే...

రంగ : మీ అమ్మాయి లలితను...

లింగ : చూడండీ, అమ్మాయి ఇష్టానికి వ్యతిరేకంగా నేనేమీ చెయ్య దలచలేదు. ముందు దాని ఇష్టం తెలుసుకోవాలి.

రంగ : అలాగే, అలాగే, అమ్మాయి సమ్మతితోనే చేద్దాం.

లలిత : నాన్నా. పొద్దుపోతూ ఉంది. ఈమందు త్రాగి తొందరగా నిద్రపొమ్మని డాక్టరు చెప్పారు.

రంగ : మరి నే సెలవు పుచ్చుకుంటాను లింగరాజుగారూ,

లింగ : అలాగే. అమ్మా నీతో మాట్లాడాలి ఇలా కూర్చో.

లలిత : ఏమిటి నాన్నా.

లింగ : మన కెంత ఆస్తి ఉందో నీకు తెలుసా అమ్మా.

లలిత : తెలీదు నాన్నా.

లింగ : నే చెబుతా విను. పదెకరాల నిమ్మతోట, పదెకరాల ద్రాక్ష తోట, ఒక బియ్యపు మిల్లు. రెండు భవంతులు. ఆస్తి ఎంతుందో తెలుసమ్మా.

లలిత : తెలీదు నాన్నా.

లింగ : మొత్తం వ్యాపారం పద్దెనిమి లక్షలు. ఐదులక్షలు వడ్డీల మీద. ఐదులక్షలు చెక్కర ఫ్యాక్టరీ వాటాల్లో. మిగిలింది మన ఇంట్లో బంగారం రూపంలో ఉంది. ఆ బంగారం చూశావా అమ్మా.

లలిత : ఇప్పు డెందుకు నాన్నా.

లింగ : నువ్వు చూడాలమ్మా. ఆడపిల్లవు. ఎందుకైనా మంచిది. అన్నీ

లలిత : నువ్వు లేవొద్దు. నేను తీస్తా చెప్పు నాన్నా.

లింగ : అవిగో ఆ పచ్చ గుడ్డ మూటలు. అవి. ఇక తాళం వెయ్యమ్మా.

లలిత : అలాగే నాన్నా. ఇదిగో తాళంచెయ్యి. నీ దిండు క్రింద పెడుతున్నా.

(విషాద సూచక వయొలిన్)

లింగ : ఊ, (పెద్దగా దగ్గుతాడు)

లింగ : అమ్మా లలితా, ఇలారా. లలితా.

లలిత : (ఆత్రంగా) ఏమిటి నాన్నా.

లింగ : ఇనప్పెట్టె తెరుపు. ఆ బంగారం, వజ్రాలు, దస్తూ, ప్రోనోట్లూ, వాటాపత్రాలు ఇలా పట్టుకురా.

లలిత : ఇప్పుడెందుకు నాన్నా అవన్నీ.

లింగ : (రొప్పుతూ) ఏముంది. ఒకమారు వాటిని నా కళ్లారా చూడాలి

లలిత : ఇదిగో నాన్నా.

లింగ : ఆఁ, అలాగే ఉంచు. (పెద్దగా దగ్గి) ఇక నే వెడుతున్నా. మీ అమ్మ దగ్గరికి వెడుతున్నా. పరవా లేదు. అన్నీ ఉన్నాయి. (ఆయాస పడతాడు)

లలిత : నాన్నా!

లింగ : కేక లెయ్యకు. నీకోమాట చెప్పాలి. ఇదంతా నేను సంపాదించిన ఆస్తి. దీన్ని నీకు ఇస్తున్నాను. ఒకరోజు దీని లెఖ్ఖంతా నాకు చెప్పాలి నువ్వు. ఏమంటున్నానో, వింటున్నావా ?

లలిత : లక్ష్మి, లక్ష్మి.

లింగ : (పెద్దగా దగ్గి రొప్పుతాడు)

లక్ష్మి: ఏంటమ్మా.

లలిత : నాన్నా, నాన్నా.

లక్ష్మి : బాబుగారు పడిపొయ్యారమ్మా.

లలిత : నాన్నా, నన్ను ఏకాకిని చేసిపొయ్యావా నాన్నా.

(ఏడుస్తుంది)

లక్ష్మి : ధైర్యం తెచ్చుకోండమ్మా, ఇక ఈ ఇంటికి యజమాని మీరే. ఏడవకండమ్మా.

లలిత : నాన్నా, పొయ్యావా, నాన్నా. (ఏడుస్తుంది)

(రోజులు గడిచినట్లు సూచించే పావునిమిషం విరామ వాయిద్యం)

లలిత : లక్ష్మి !

లక్ష్మి : ఏమమ్మా,

లలిత : మన ఇల్లంతా పాడుబడి పోయినట్టుంది కదే.

లక్ష్మి : అలా అనకండమ్మా, సిరిగల ఇల్లు.

లలిత : నా అన్న వాళ్లు లేకపొయ్యాక ఎందుకే ఈ సిరి.

లక్ష్మి : ఆ పట్నం మహారాజు మెరుపు తీగలా వచ్చినట్టే వచ్చి, అయిపు లేకుండా పొయ్యాడు.

లలిత : ఇన్నాళ్ల నుంచీ ఒక్క ఉత్తరం కూడా వ్రాశాడు కాదేమే.

లక్ష్మి : ఏం చెప్పనమ్మా — ఈ మగజాతి అంతా ఇంతే. గడప దాటితే గాడి దాటుతారు.

లలిత : బావ మళ్లీ వస్తాడంటావే.

లక్ష్మి : మీ సిరి చూసైనా రావాలి. వొట్టి బేపరవా మనిషి లాగున్నాడు. జాడైనా తెలిస్తే జబ్బ పుచ్చుకు లాక్కొద్దును.

లలిత : బావను అంతపని చేస్తావే.

లక్ష్మి : లేకపోతే మనసిచ్చిన మా లక్ష్మిని మర్చిపోతాడా. విశ్వాసం లేని మనిషి.

ఆనందస్వామి: (దూరంనుంచి) అమ్మా, లలితమ్మా.

లక్ష్మి : స్వాములవారు వచ్చారమ్మా.

ఆనంద : అమ్మా లలితా !

లలిత : స్వాములవారూ (ఏడుస్తుంది.)

ఆనంద : విన్నానమ్మా, సంచారం నుంచి వొచ్చి అంతా విన్నాను.

లలిత : (వెక్కుతూ ఉంటుంది)

ఆనంద : వద్దమ్మా, ఏడవకమ్మా, నువ్వు ధైర్యం తెచ్చుకొని మళ్లీ ఈ ఇంటికి శోభ తేవాలమ్మా.

లలిత : నావల్ల ఏమవుతుంది స్వామీ.

ఆనంద : అలా అధైర్యపడకమ్మా నువ్విక తక్షణమే ఒక ఇంటిదానివి కావాలి,

లలిత : నాకా అదృష్టం లేదు స్వామీ.

ఆనంద : నాకు తెలుసమ్మా. ఇంక నీ మేనబావ మీద ఆశలు పెట్టు కొని లాభంలేదు. నీకిష్టమైన వరుణ్ణే చూచుకో.

లలిత : నాకింకేమీ వద్దు స్వామీ.

ఆనంద : అంతమాటనకమ్మా. నీ ధర్మం నువ్వు నిర్వర్తించాలి. ఇష్టాంలో ధర్మం నెరవేరిస్తేనే పరం బాగుంటుంది. నా బిడ్డ వంటి దానివి. నా మాట వినమ్మా లలితా.

లలిత : నాకేమీ తోచడంలేదు స్వామీ.

ఆనంద : నువ్వు చాలా మంచి హృదయం కలకన్యారత్నానివి తల్లీ. మీ నాన్న మంచో, చెడో చేసి కీర్తో, అపకీర్తో తెచ్చుకొని ఇంత సిరి ఇచ్చి వెళ్లాడు. నువ్వొక ఇంటిదానివై సత్కార్యాలు చేసి పుట్టింటి వారికీ, మెట్టింటివారికీ మంచి పేరు తేవాలి తల్లీ. మరి నే వస్తానమ్మా.

లలిత : అలాగే స్వామీ — మీ ఆశ్రమం చందా రేపుతీసుకువెళ్లండి.

ఆనంద : అలాగే తల్లీ...

(ఉత్సాహమిచ్చని జంత్రవాయిద్యం మొదలవుతుంది)

లక్ష్మి : (వస్తూ) అమ్మా, ఉత్తరం వొచ్చిందమ్మా.

లలిత : ఎక్కడనుంచే.

లక్ష్మి : పోస్టు జవాను ఇచ్చెళ్లాడమ్మా, ఇదిగో.

(వాయిద్యం విషాదంగా మారేట్టుగా)

లక్ష్మి : ఎక్కణ్ణుంచి అమ్మా. బావ దగ్గరనుంచేనా.

లలిత : (గంభీరంగా) అవును.

లక్ష్మి : గంతులెయ్యక అలా వున్నావేమమ్మా. ఏమని వ్రాశారమ్మా.

లలిత : లక్ష్మి (వెక్కి పడుస్తుంది)

లక్ష్మి : ఏమమ్మా.

లలిత : నా ఆశలన్నీ కూలిపోయ్యాయే.

లక్ష్మి : చెప్పమ్మా సంగతేమిటో.

లలిత : నాపై ఆయనకు ప్రేమ లేదట. బొంబాయిలో పెద్దింటి సంబంధం చేసుకో బోతున్నాడట. నా సొమ్ము నాకు పంపిస్తాడట...లక్ష్మి (వెక్కుతుంది)

లక్ష్మి : పచ్చి మోసగాడు. మరేం బెంగపడకండమ్మా. నీ అందం, నీ సిరీ చూచి లక్షమంది రెక్కలు కట్టుకు వాల్తారు.

శేఖ : (బైటినుంచి) లక్ష్మి !

లక్ష్మి : శేఖరం బాబుగారు వచ్చాడమ్మా.

లలిత : వరండాలో కూర్చోమను.

శేఖ : లక్ష్మి. అమ్మగారున్నారా ?

లక్ష్మి : ఇప్పుడే వస్తారు కూర్చోండి బాబూ.

లలిత : (ముఖావంగా) ఇలా వచ్చారు.

శేఖ : ఏమీ లేదు. మీ ఆరోగ్యం కనుక్కుందామని.

లలిత : ఫరవాలేదు. బాగానే ఉన్నాను.

శేఖర్ : మా నాన్నగారు ఎప్పుడూ మీ గూర్చే అంటూ ఉంటారు.

లలిత : వారు మా కుటుంబ శ్రేయోభిలాషులు.

శేఖ : నాకూ ఆ అవకాశం కలిగించండి.

లలిత : అంటే ?

శేఖ : నా ఉద్దేశం మీకు తెలుసనుకుంటాను.

లలిత : నా స్థితి ఏమిటో మీకు తెలుసా ?

శేఖ : తెలుసు, మీ పట్ల నాకు సానుభూతి ఉంది.

లలిత : వివాహంద్వారా మీరు కోరే సర్వస్వమూ నేను మీ కివ్వలేక పోవచ్చు.

శేఖ : మీతో సహధర్మం నాకు చాలు.

లలిత : నాకు కొన్ని చెరపరాని స్మృతులున్నాయి. అవి మీకు...

శేఖ : మీ వంశంతో బాంధవ్యం ఏర్పడ్డమే నాకు కావలసింది. మీ రెన్నటికీ స్వతంత్రులే.

లలిత : ఐతే మన వివాహానికి ముందు మీరొక పని చెయ్యాలి.

శేఖ : అలాగే చేస్తాను. చెప్పండి.

(విషాద సూచిక వయొలిన్ విన్పిస్తూ ఉండాలి)

లలిత : ఇవి రెండు లక్షల రూపాయలు.

శేఖ : ఏం చేయమంటారు.

లలిత : మీరు ఇవాళే బైలుదేరి బొంబాయి వెళ్లి యీ జాబితాలో ఉన్నవారికి వడీతో సహా అప్పులు చెల్లించాలి.

శేఖ : అలాగే చెల్లిస్తాను,

లలిత : వారి దగ్గర రసీదులు తీసుకుని వాటిని నేనిచ్చే ఉత్తరంతో కూడా మా మేనబావ రాజారావు గారికి అంద జెయ్యండి.

శేఖ : అలాగే.

లలిత : ఉండండి. ఈ బంగారపు కేసు, యీ ఉంగిరం, ఈ రవ్వల దుద్దులు, పదిలంగా రాజారావుగారి కప్పగించండి. ఇది ఆయన మా ఇంట్లో దాచిన నిక్షేపం. అయనది ఆయనకు అప్పగిస్తున్నాము.

శేఖ : అలాగే మరి నేను ప్రయాణమై వస్తాను. ఉత్తరం వ్రాసి ఉంచండి.

లలిత : వెళ్ళిరండి. (వెడతాడు)

లక్ష్మి : అమ్మా, శేఖరంగారిని చేసుకుంటామన్నారా?

లలిత : (పరాకుగా) ఉ.

లక్ష్మి : ఆయనకి మా బాగా బుద్ధి చెప్పారమ్మా.

లలిత : లక్ష్మి, నువ్వు తప్ప ఈ ప్రపంచంలో నిజంగా నన్ను ప్రేమించే వాళ్లెవరూ లేరు. ఎవ్వరూ లేరు. (శోకిస్తుంది)

లక్ష్మి : ఏమని వ్రాశారమ్మా ఉత్తరం.

లలిత : వింటావా, నువు తప్ప వినడానికి ఇంకెవరున్నారు నాకు.

లక్ష్మి : చదవండమ్మా వింటా.

లలిత : (దగ్గుత్తికతో చదువుతుంది)

" రాజారావు బావగారికి,

మీ ఉత్తరం అందింది. నా ప్రత్యుత్తరం తీసుకొస్తున్న శేఖరంగారు అన్ని సంగతులూ మీకు చెబుతారు. మీరన్నట్లు నేను మీ వాతావరణానికీ, మీ పరిసరాలకూ చెందిన దాన్ని కాను. మీరు కోరే ఆనందాన్నీ, అంతస్తునూ నేను ఇవ్వలేనన్న మాట నిజమే. అందుకే తప్పుకుంటున్నాను. మీ కోర్కె నెరవేరడానికి మీ నాన్నగారు చేసిన అప్పులు ఆటంకంగా ఉన్నాయని తెలిసింది. వాటిని తీర్చేసి మీ [illegible]

చేస్తున్నాను. మీ ఆనందానికి మరేమైనా చేయగలిగితే ధన్యురాలను. ఏ నాటికయినా మీ సేవకే యీ లలిత."

(పెద్దగా వెక్కి వెక్కి ఏడుస్తుంది)

లక్ష్మి : లలితమ్మా!

(విషాదాంతంగా వయొలిన్ వాయిద్యం)

(ఆకాశవాణి ప్రసారితం)



కవిత :

# సాకీ!

— శ్రీ ఎస్. రాజన్న

(' సాకి ' ఉమర్ ఖయ్యాం సృష్టించుకొన్న ప్రత్యేక పాత్ర, ఆమెను ఉమర్ ఇట్లా సంబోధించుచున్నాడు.)

సాకీ! తావక సుందరాక్షియుగ లజ్జాస్మేర పీయూష ధా
రాకుల్య స్థలిఁ దానమాడెదను – తీవ్రాఘాత సిద్ధాంత బా
ధాకార్కశ్యము లింకిపో–నిదిగో! నూత్నం బాసవంబందె; రా
వే! రానున్నది కాకమానదిక జంకేలన్ రహశ్శాంతికిన్.

పుప్పొడి గప్పిన పూవుల
చొప్పగు చిఱునగవు వెలయు చొక్కపు మోవిన్
ముప్పిరి గొనుతమి నొకపరి
రప్పెద నా చుంబనమునఁ కప్పురగంధీ!

వచ్చున్ బోవును రాత్రియున్ బవలు, దుర్వారత్వరన్ సంపదల్
హెచ్చున్ దగ్గును లోకమర్త్యులకు సాకీ! ప్రేమ రాహస్య సం
పచ్ఛో భాత్ములకెట్లుఁజూచినను నద్వైతంబు నిత్యంబు, ర
మ్యచ్ఛాంభోజ విలీన నేత్రముల హాసాంకూరముల్ బెంచుచున్.



వ్యాసము:

# వచనం, గేయం, పద్యం

శ్రీ దుర్గానంద్.

కవిత్వం పద్యం నుంచి విడిపోయి, గేయమై మళ్లీ అది వచన గేయమై చివరకు వచనంలోనే హరించి పోయి ఇక సృష్టి మీద వచనమే సర్వత్రా తాండవం చేస్తుందనీ, ఈ అనభ్యుదయ చిహ్నమైన కవిత్వం ఎంత త్వరగా పోతే ప్రపంచానికి అంత ముక్తి గలుగుతుందనీ కొందరి అతిమేధా జీవుల ఆశాభావం. కవిత్వం పోవడం వచనం రావటం అనేది పక్కని ఊహ. పెదవులు నవ్వుతూ ఉంటాయి. మాట్లాడుతూనూ ఉంటాయి. పెదవులు కొంత కాలానికి మోటని నవ్వటం మానివేసి మరి కొంత కాలానికి చిరునవ్వుగా మారి క్రమేణా పొంతం నవ్వును ఆపివేసి ఇక ఎప్పుడూ మాట్లాడుతూనే ఉంటాయి, ఇదీ దాని క్రమ పరిణామం అంటే ఎంత విచిత్రంగా ఉంటుందో పై మాట కూడా అంతే విచిత్రంగా ఉంటుంది. కవితా వస్తువు గంధకం మందు వంటిది. సరైన బిగింపుతో సరైన కాలంలో ధట్టించి పేల్చితే ధ్వనిస్తుంటుంది. దాని కావాసనలు కూర్చకనానుడుగా వదిలితే చురచుర మని నీరు గారి పోతుంది. ఈ మందు పద్యంలో పగులుతుంది. గేయంలో పగులుతుంది, మరి వచన గేయంలోనూ వచనంలోనూ పగులుతుందో లేదో ? చూడాలి ! గద్యంలో ఒకొకప్పుడు ఒక శబ్దాన్ని చూచీ ఒక భావాన్ని చూచీ ఇక్కడ రచయిత కవి పోకడ పోతున్నాడు అంటాము. అదే కవికీ రచయితకీ ఉన్న పెద్ద తేడా. ఈ తేడా దేంట్లో ఉంది ? ప్రతి దాంట్లోనూ ఉంది. ఒక వస్తువును తీసుకోవడంలోనూ, ఒక శబ్దాన్ని మలచడంలోనూ ఇంకా ఎన్ని రకాలగానో ఉంది. కథకునకు వస్తువంతా గ్రాహ్యం అవుతుంది కాని కవికి వస్తుసారమే గ్రాహ్యం. కథకుడు అనుభవం ఇస్తాడు. కవి అనుభూతిని ఇస్తాడు. కథకునకు జీవిత వివరణ కావాలి. కవికి జీవిత సారాంశం కావాలి. కథకునకు కథకు సంబంధించిన నిగ్రహమే ఉండాలి. కవికి భాషకు సంబంధించిన నిగ్రహం కూడా ఉండాలి. ఒక భావావేగాన్ని, దాని బరువునూ ఒడుపునూ కూడా తూచి దానికి ఎంత శబ్దం ఇవ్వాలో ఎంత సంగీతం కూర్చాలో కూర్చి తగ్గా గానాన్ని సాగిస్తాడు కవి అందులో [illegible]

శాస్త్రం ఛందస్సూ, సంగీతం, భాషా సంస్కరణ వాదమూ, అన్నీ ఉన్నాయి. ఇవన్నీ వృథేనా ? సామాన్యుని ప్రయోజన దృష్టితో చూచినా వచనం కంటే కవిత్వమే గొప్పదని నా అభిప్రాయం. సామాన్యుడికి వచనం తేలిగ్గా అర్థమౌతుంది అంటారు. ఔను అర్థమౌతుంది. కాని ప్రశ్న ఇదికాదు. ఏది అతని హృదయంలో హత్తుకుంటుంది ? సామాన్యుడు దేన్ని మరచి పోకుండా తన జీవితంలో దాచుకుంటున్నాడు ? కొందరు విస్ఫారిత నేత్రాలతో చూస్తారు. కొందరు వాలుగన్నులతో చూస్తారు. విస్ఫారిత నేత్రాలు వెంటనే అర్థమయినాయి. అందువల్ల వాటిని పట్టించుకోము. వాలుగన్నులు సరిగా అర్థంకాలేదు. అందువల్ల అర్థం చేసుకోవడానికి ఎన్నోసార్లు పదే పదే చూస్తాము. ఇంకా అర్థం కాకపోతే రాత్రీ తెల్లవార్లూ మేలుకొని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాము. దీన్ని బట్టి అర్థం గానివన్నీ వాలుగన్నులే అంటానికి వీల్లేదు. ఏదో బయటికి విడబడీ రాలేక రెప్పల కంటుకున్న సిగ్గు లాంటి పదార్థం ఆ కన్నుల్లో ఉంది. ఆ పదార్థమే కవిత్వంలో ఉంది. అలాంటి దాన్ని వచనంలో కూడా పెడతాం దానికేం అంటారు. మంచిదేకాని ఆవాలుందనము ఆ కన్నుల కతికే గుణమో కాదో చూచుకోవాలి.

కవిత్వంలో ఉన్న ఈ గొప్పతనాన్నే విడమర్చి అర్థం చేసుకోవడానికి సామాన్యులు కూడా తహతహలాడుతారు. కాళిదాసు ఎవ్వరికీ అర్థం కాని సంస్కృతంలో వ్రాశాడు. తిక్కన్న క్లిష్టమైన భాషలో వ్రాశాడు. అయినా అవి ఎందుకు అంత ప్రచారమవుతున్నాయి ? వాటిని తరచి తరచి అర్థాలు చెప్పుకొని వ్యాఖ్యానాలు చేసి టీకలు వ్రాసి ప్రపంచం ఎందుకు నానా యాతన పడుతుంది ? వాళ్లు అంత సంయమంతో అంత గొప్ప సమాధిలో ఉండి వ్రాశారు గాబట్టి. అలాంటి పరిశ్రమ వృథ పోతుందా ? కళాకారుడు ఎంత లోలోన మునిగితే ప్రజలు వానిని అంతంత పైకి తేలుస్తారు. చప్పున ప్రజలు ఆ నిమిషంలో అందుకోక పోవచ్చు. వాళ్ల రచనలు ఆ నిమిషంలో వేల ప్రతులుగా కనిపించక పోవచ్చు. ఆ ప్రతులు మనకు కనపడకుండా కొన్ని తరాల భవిష్యత్తు వరకూ లక్షల సంఖ్యలో పరచబడి యుంటాయి. ఇంతెందుకు ? శ్రీశ్రీ తన కవిత్వంలో చెప్పిన భావాలే చాలా మంది రచయితలు చెప్పారు. వాళ్లందరి కంటే శ్రీశ్రీ కవిత్వం మీదే ఎందుకు అంత చర్చ జరగాలి ? ఎందుకంటే భావమే అక్కడ ప్రధానం కాలేదు. దాని క్రింద ఎన్నో ఆవేశాలు, ఎన్నో సంయమాలు, ఎంతో అభివ్యంజనా. ఎంతో

భాషా వ్యవస్థా ఉంది. ప్రతి అక్షరం క్రిందా ఆ కవి అనంత పరిశ్రమ ప్రతి ధ్వనిస్తుంది. మహాకవి ఎప్పుడూ అంతే, ఒక మహానది లాగా ప్రవహించి పోతాడు. దానికి కాలువలు పాదెలు తీర్చి పంట చేలదాకా ఆ నీటిని మనం తెచ్చుకోవాలి. ప్రజలు ఆ పనిని చేసుకుంటారు. పద్యం గేయం వచనం సంగతి విచారించుదాం. పై చెప్పిన దాన్ని బట్టి చూస్తే ఏ ప్రక్రియలో ఎంత ఎక్కువ సంయమం ఉంటుందో అది అంత గొప్పది. పద్యం అలాంటిది కాబట్టి గేయం కంటే అది గొప్పది. పద్యంలో పాట, అర్థం, భాష, ఇన్నిటి మీదా దృష్టి ఉంచాలి. గేయంలోకి వచ్చేటప్పటికి పాట ఎక్కువై అర్థం కొంచెం తరిగి పాటతో కూడుకున్న స్పందన మాత్రమే నిలుస్తుంది. పద్యకవి గేయకవిలోకి వచ్చేటప్పటికి 'అర్థం' అనే గుణాన్ని కోల్పోతాడన్నమాట. అందువల్ల ఇతడు పద్యకవి తరువాతి వాడు. ప్రపంచ కవుల్ని పరిశీలించినా ఇది నిజమనిపిస్తుంది. అర్థం తక్కువైనా గేయ కవి హృదయోద్గారాన్ని ఎక్కువ ఇస్తాడు గదా అనవచ్చు. అవును. కాని అది అన్ని రసాల్లోనూ, అన్ని దశల్లోనూ ఇవ్వలేడు. హృదయంలో కదలిన కదలిక, ఒక ఝుంకారం వంటి భావం వచ్చినప్పుడే అతని వీణ మ్రోగుతుంది. ఏదైనా గడుసు పెళుసు విషయం వచ్చినప్పుడు ఆ వీణను అవతల వేయవలసి వస్తుంది. గేయకవి (అభ్యుదయ గేయకవి కాదు.) సుకుమారుడే గాని సర్వవిషయాభిగమ్యుడు కాదు. అదీ గాక జీవితంలో పాట కంటే అర్థానికి ఎక్కువ విలువుంది. అయితే మరి గద్య రచయిత అర్థాశ్రయుడే గదా అనవచ్చు. కాదు. అర్థం అంటే ఏమిటి ? 'అశ్వం' దాని అర్థం 'గుర్రం'. ఇది దానికి అర్థమే కాదు. ఈ రెండు శబ్దాలూ సంజ్ఞా వాచకాలే. ఒక శబ్దానికి అర్థముంటుట మనేది రసభావాదులు, సంస్కారం, జీవన వ్యవస్థ మొదలైన వాటికి సంబంధించిన విషయం. 'గృహిణి' అనే శబ్దం ఉంది. దాని అర్థం ఒక్క మాటలో చెప్పలేం. దాన్ని గురించిన ధారణ మాత్రం మన హృదయంలో ఉంటుంది. అదీ ఆ శబ్దానికి అర్థం. ఇలా కవి శబ్దార్థ సంబంధాల మీద పరిశ్రమ చేస్తాడు. అందువల్లే అతని శబ్దంలో శ్లేష ఉందా ధ్వని ఉందా, వాచ్యం ఉందా అని శబ్దాంతర్గతమైన పరిశీలన కూడా చేస్తాము. గద్య రచనలో శబ్ద బాహ్యమైన విశేషమే ఉంది.

ఇప్పుడు ఇంకో ప్రక్రియ వచన - కవిత అనేది వచ్చింది. దాని నిలకడను మనం ఆలోచించ వచ్చు. మనకున్న ప్రక్రియలనే వాడుకోటానికి చాలిన

సంస్కారబలం లేకనో ప్రజల రుచిని బట్టో కొన్ని క్రొత్త ప్రక్రియలు బయ
టికి వస్తున్నాయి. గురజాడ, బాపిరాజు శ్రీశ్రీ మొదలైన వారు వచన
గేయాలు, గేయాలూ వ్రాశారు. ఎందుకు వ్రాశారు, పెద్ద అవసరం నెట్టు
కొచ్చి ఏదీ దొరక్క బాధపడి కసికొద్దీ వ్రాశారు. అది అసలు క్రొత్త
మార్గాలు త్రొక్కే కాలం. ఇప్పుడెన్నో ప్రక్రియలు వాటంతట అవే పుడు
తున్నాయి. నడక లెక్కువైనాయి, దారులు తక్కువైనాయి. వచన-కవిత
ఒకరకంగా చూస్తే కవిత్వానికి వికాసమనాలి. ఎందుకంటే దాంట్లో మొదటి
ఆవేశాభ్యుదయ కాలంనుంచి దాటి ఆలోచనా కాలం పొలిమేరల్లోకి
వచ్చిన కవి మానసిక స్థితి కనిపించుతుంది. అటు అర్థం కాని భావకవుల అమో
మయ స్థితి లేదు. గద్యమూ అంటానికి దీనిది గద్య శిల్పం కాదు. ఒక అస్పష్టమై
నలయ కూడా ఉంది. దీనిలో ఇన్ని మంచి గుణాలు ఉన్నా ఇది నిలవదు. ఎందు
వల్ల నంటే ఇది ఎక్కువగా కవి వెసులుబాటు మీద ఆధార పడిన పద్ధతే
గాని పాఠకుని ఆస్వాద ప్రవృత్తులు మీద ఆధారపడిన పద్ధతి కాదు. పాఠ
కుడు రెండే పనులు చేస్తాడు. ఒకటి పాడుకుంటాడు, ఇంకొకటి చదువు
కుంటాడు. మరి దీన్ని ఏమి చేస్తాడు ? ఆలోచించుకుంటాడా ? అది గద్య రచ
యితే చేయిస్తాడు. దీంట్లో ఉన్నలయను కాపాడే జాగ్రత్త ఆయా కవి
స్వ + ఇచ్ఛ మీదే ఆధారపడి ఉంటుంది. అందువల్ల తరువాత కవులు స్వ +
ఇచ్ఛా నియమంతో ఆ గుణాన్ని కూడా తీసివేసి ఇటు గద్య రచయితల్లోకి
పోవచ్చు లేకపోతే ఇంకా బిగించుకొని గేయంలోకి పోవచ్చు. మరి ఇది అంత
స్వచ్ఛందమైన ప్రక్రియ గదా. అటు లాస్యమూ కాదు. ఇటు తాండవమూ
కాదు. నారదుని చిందువంటిది. ఈ నారదుని చిందును తరువాత వాళ్ళు
ఎంతవరకు కాపాడుతారో చెప్పలేము. ప్రక్రియ గొడవకు పోకుండా చూస్తే
వచన కవితలో వ్యక్తిగతంగా చెప్పాలంటే కుందుర్తి అత్యంత నిష్ణాతుడు.
అంతేగాదు ఈ యువతరం కవుల్లో కూడా బాగా పేరుమోసిన మోయ
నున్న కవుల్లో కూడా అతను ప్రతిభావంతుడు, జాగరూకత గలిగిన కవి.
కొంతమంది ఎంత బాగా వ్రాసినా చప్పున కనిపించరు. కొందరు ఎంత
నాసిగా వ్రాసినా కనిపించుతారు. రాజకీయపుటండలు, పత్రికల
పొత్తులు, బదులుకోలు మెచ్చుకోళ్లలో మనిషికి మనిషే సరిగా కనిపించ
డం లేదు. ప్రతిభావంతులేం కనిపిస్తారు ! ఏమైనా కవితకు కాలం చెల్లిందంటే
సృష్టికి కూడా ఆశ్చర్యం. ఒకవేళ పాశ్చాత్యదేశాలు కవి ప్రాధాన్యం లాగి

వేస్తే ఆ పాశ్చాత్యదేశాలే పోతాయి కాని కవి పోడు. పాశ్చాత్య ప్రపంచం ఇచ్చిన సభ్యతలో మానవుడి జీవితం శుష్కప్రాయమై పోయింది. కవిని కలుపుకొని వచ్చినంతవరకు రాజకీయం సుభిక్షాన్ని ఇచ్చింది. కవిని కలుపుకోని అణ్వస్త్రం రవ్వలు విసిరింది. కవి హృదయాన్ని కలుపుకోక ప్రజలకు జీవనసౌందర్యాన్ని ప్రసాదించలేక చేసే శాస్త్రీయ పరిశోధనలు, విసరే రాకెట్టులూ, సీమటపాకాయల కంటే ఎక్కువ విలువైనవి కావని ప్రతి సామాన్యుడూ గుర్తించుకుంటున్నాడు. అలాంటి వ్యామోహాలు అసలు కవికేమీ అక్కర్లేదు.



గ్రంథస్వీకారం :—

సిద్ధ పురుషులు— Dr. టి. యం. పి. మహాదేవన్
అనువాదం :- శ్రీ ఎస్. సుబ్రహ్మణ్యం

విశ్వమానవ మతము— రవీంద్రనాథటాకూర్
అనువాదం :- శ్రీ బొమ్మకంటి వేంకట సింగరాచార్య,

ఛలక్ తే ఆంసూ ఫిర్ చు సౌతి (హిందీ)— శ్రీ శివశయాల్ భ్రమర్

తెలుగు కావ్యమాల- సంకలనకర్త శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు,

భావోదయము— శ్రీ జి. వేంకటరమణప్ప.

ఘృతాచి— శ్రీ యల్. చెన్నారెడ్డి.

దివ్వెల మువ్వలు- శ్రీ సి. నారాయణరెడ్డి.

అరుంధతి— శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి.

# గులాబి

— శ్రీ కందుకూరి రామభద్రరావు

అరుణ రంజితాధర దరహాస మటుల
సుందర దళమ్ము విరిసిన సోయగమ్ము,
తెమ్మెరలపైని తోతెంచు కమ్మతావి
మనసు హరియించు మాత్రమునసె

ఇటుల కొనగోళ్ల ద్రుంపగానేల ? నేల
నన్ను స్పృశియించి: పరిరక్షణమున నిలుచు
కంటకమ్ములు తాకి రక్తమ్ము గ్రమ్మ
కరతలాన దిరస్కృత కానలేవొ !

ఓయి రసహీన కఠినుడా : ఒప్పులొలుకు
మందిరారామసీమ నానందదోల
నూగుపూబాల బులుక నెట్లోర్చె నెడద ?
ముచ్చటలు తీరునేవెడగ : ఆమోదమెడల

కోత భరియింపలేక నీచేత జిక్కి
క్షణములో రేకు లొక్కటొక్కటిగ జాఱి
పరిమళా నిలంబులు నేలపాలుకాగ
తొడిమమాత్రము మిగుల సంతోషమటర !



వ్యాసము

# ఆముక్త మాల్యద

శ్రీ పప్పూరి రామాచార్యులు.

(గత సంచిక తరువాయి)

## పెద్దలు కూర్చిన నిక్షేపము

ఆ యేడు వర్షములు చక్కగా కురిసినవి. ముంగారి జల్లు ముందు ముందుగా పెళపెళధ్వనులతో వంపుగా వాలి నట్టింట్ల తడపి చనినది. రెండవ జల్లు వసగండ్లు నేలనిండుగ కురిసి ఆవిరిని, పరాగమును ఎగుర జేసినది. మూడవ వర్షము ఉఱుములు మెఱపులతో పెండికటులు కల్గించి మిన్ను మన్ను ఏకమగు నట్లు నిలుకడగా కురిసినది. నాల్గవది ఉయ్యాల చేరులవలె జల్లుపై జల్లుగా అల్లుకొన్నది. తర్వాత కడవ పోతగా వృష్టి బలసినది.

భూమియంతయు పైరు పచ్చలతో ప్రకాశించినది. ఇంద్ర గోపములు రత్నములవలె చేలలో చూపట్టినవి.

గుమ్మడలు పడుటచేత మంటి మిద్దెల వారికి నిద్ర అరుదయ్యెను. సంతలకు వెళ్లినవారు మరలి వచ్చునప్పుడు తడిసి శీత బాధకు గురియైరి. నీటినానిన వంట చెఱుకులు వండుటకు ప్రొయ్యి నిడగా రాజుకొని నీరు విడుచుటచే నిజముగా గానుగలలో రసము స్రవించు చెఱకులని పించినవి.

ఇల్లిల్లు తిరిగినగానీ, ఒక్కింత నిప్పుదొరకదు. ఇంటిలో పూరి యిడి విసరక అదియు రాజుకొనదు. రాజినను రవులు కొనునను ఆసలేగాని అన్నము కూరలు అగుట కష్టము. వంట సిద్ధమైనను ఆ పొగలో సుఖ భుక్తి కలుగదు. ఆ భుక్తికిడిన యన్నము మొదటి పంక్తి వారికే సరిపోవును. ఆడవారికి పునః పాక ప్రయత్నము తప్పదు. ఆ ప్రయత్నములో వారు పంచకు వేసిన వాసములను విఱిచి గుడ్డ పేలికలను నేతిలో తడపి ప్రొయ్యిని బెట్టుటలోని నష్టమును లెక్కించుటలేదు. ఇంతైనను అర్ధ రాత్రి వరకును ఇల్లాండ్రకు భోజనము లభింపదు. మగలు ముందుగా భుజించి పడుకొన్న

బీదలు నివసించు బయలి పూరి కొట్టములు పైన మబ్బులు క్రమ్ము కొనగా సాయం సమయములందు లోపలినుండి పొగలు వెడలు చుండగా మేఘములు పాతాళమును జయింప బోవుచు, భూమి మీద దండు విడిన విధముగా తోచు చుండెను. గుడిసెలలోని జవరాండ్రు ఆ చీకటిలో వెలికి వచ్చుటకు వెరచి తొలచిన కంచములను కడప కవ్వలి నుండియే చల్లు కాంతులు వెలికి ప్రసరించి అవి ఆ మబ్బులలోని మెఱపులుగా కనుబడినవి.

అటునుండి ఇటునుండి వానకు తల దాల్చు కొనుటకు ఊరి చావడు లలో దూరిన వారు ఊరకుండక హయపతి గొప్ప కాదతని కంటె గజపతి బలవంతుడని, కాదు నరపతులందఱకంటె బలవంతులని వారి బలా బలములు లెక్కించుచు, తీవ్రముగా వాదులాడుచు వాన వెలియగనే వాదము చాలించి ఎవరి దారిని వారు వెడలి పోదురు.

వీదలగు కాపురెడ్లు, గురుగు చెంచలి తుమ్మి ఆకు కూరలు చింత చిగురుతో కలిపి నూనెతో పొరటిన బోడి కూరతో, పొగలు గ్రమ్ముచున్న కుట్టేరికల వేడి అన్నమును తృప్తిగా ఆరగించి, రాత్రి చేలకావలికి కుమారుల నంపి, మంచముల మీద నుండి అధికారము నెఱపుచుండిరి. వానకు తడియకుండుటకై మంచమునకు కట్టి వేసిన లేగలు తమమై నాకుచుండగా వారు అదలించు చుండిరి. ఎండిన నుగ్గులు లభింపనందున వారి ఇల్లాండ్రు మేక ఎరువు నింపిన కుంపటులను ఆ మంచముల క్రింద నుంచిరి.

మరి రాజులో, మణిమయ మండపమున కూర్చుండి నెమళ్ళు షడ్జ స్వరమున వేయు కేకలు విని ప్రొద్దెక్కి మేలుకొని, ఘుమ ఘుమ వలచు సుగంధరాజ తైలములు ఒడలికి రాచుకొని ఉష్ణవారి మజ్జన మాడిరి. దువ్వలువలు తళ తళ మెఱయు మణి హారములు మొగలు రేకలు ధరించి జామెక్కిన తర్వాత వారు కొలువొసంగిరి, అప్పుడు వెన్నగాచిన నేయిని, శాల్యన్నమును సామిషముగా సాపడిరి. కస్తూరి అధికమగుటచే నల్లనైన తాంబూల రసము పెదవులనంటగా, అగరు కుంపటులు పరిమళములను వెద చల్లు చుండగా మేడ మీది వాతాయనముల గుండ ప్రసరించు మెఱపుల కాంతుల సహింపక అర గన్ను మూసిన కాంతలతో ఆ నరపుంగవులు కేళి సలిపిరి.

ఈ విధముగా వార్షిక వాసరములు కడచి పోయినవి. శరత్కాల మాసన్నమయ్యెను. యామునుడు చతురంగబలములతో జైత్రయాత్ర వెడలి

శత్రు రాజన్యులను తన శౌర్య ధైర్య పరాక్రమములచే జయించి వచ్చెను. ఆయన యజ్ఞములు చేసెను, నానా దేశ విప్రులను దానముల దనిపెను. సుసంపన్నుడై బహుభోగోన్నతుడై నిశ్శంకతో అతడాచ మరచి యుండెను. ఎట్టి అధి వ్యాధులును లేక ప్రజలు సుఖులు శాంతులునై యుండిరి.

ఆ సమయమున శ్రీరంగమున శ్రీరామ మిశ్రుడను యోగి భగవదారాధన తత్పరుడై యుండెను. ఆయన నాథమునికి ప్రశిష్యుడు యామునాచార్యుడు నాథమునికి పౌత్రుడు. తన పరమ గురువగు నాథ ముని మనుమడు ఈ విధముగా యోగ సామ్రాజ్యంబు మరచి సామ్రాజ్యంబు నందు ఆసక్తుడయ్యెనని రామ మిశ్రయోగి విని చాల విచారపడెను. అట్టి మహాత్ముని వంశంబున బుట్టిన యితండిట్లగుట వ్యతిక్రమమని ఆయన శోకాకుల చిత్తుడయ్యెను. ఆయన ఈ విధముగా తల పోసెను :—

"ఇతని తాత ఎట్టి భక్తుడు, ఎంతట సదాచార సంపన్నుడు ! వృషాద్రి సెలయేట నిత్యమును త్రిషవణ స్నానమును నిష్ఠతో చేసెడివాడు. ఆ కొండ చఱియగుహాలో ఏకాంతమున ఆహ్నికము దీర్చి శ్రీపతి పాదపద్మములను తన హృదయ పద్మములో చేర్చి ధ్యానించెడివాడు. ప్రొద్దు మళ్లగనే యజ్ఞోపవీత పద్మాక్షమాలికతోడ యోగ పట్టిక యురినున మెఱయ ఆ పర్వతనిలయు శ్రీమన్నారాయణు సేవించి ఆయన ఇంటికి మరలెడివాడు. తన సతీమణి వండిన అన్నమును ముంగ్లముసై కూరతో గూడ ఇలువేల్పున కర్పించి, ఔపాసనాది హోమములు ముగించి ఈ విధముగా నిత్యమును ఆ మహానుభావుడు తను యాత్ర సాగించెడివాడు.

ఆయన మనుమడో విషయాతురుడైనాడు. విషయలంపటుని వానిని విడువుమని చెప్పినచో తప్పక పగ పెర్పడును. కావున ఏదేనొక యుపాయము చేత తొల్లింటి కథల ననుసరించి ఆయనను విషయముల నుండి తప్పించి రక్షింపవలెను.

తన పుత్రులకలవడిన దుర్వ్యసనములను సైతము తండ్రి తొలగచేయ జాలడుగదా ! మఱి రాజ్య సుఖలంపటుని ఆ వ్యసనము నుండి వారించుట ఎవ్వరికి సాధ్యము ?

కొంత రక్తమును గ్రోల నిచ్చి సివంగినోరి జింకనుతిలియు వేటకాని వలెనే ఆతనికున్న విషయతృష్ణను కొంత తీరనిచ్చి తర్వాత మనసు మళ్లిం

నిరంతరము సేవించిన ముస్తెకూర అట్టి దోషమును కొంత తొలగింప నోపును."

అని చింతించి శ్రీ రామమిశ్రులు ముల్లుదయింపని లేత ముస్తె కూరను మోశాంగనకు పల్లేరు పువ్వుల వలె నుల్లసిలు పువ్వులుదయించినదానిని తెచ్చి యామున మహారాజు గారి వంట బ్రాహ్మణుని కిచ్చి ఒక వైష్ణవుడు కాను కిచ్చెనని రాజుగారికి వడ్డింపు మని ప్రార్థించెను. మహారాజు ఆ కూరను ప్రీతిగా స్వీకరించిరి. కొన్నాళ్లల్లే ఆయన నిత్యమును కూర తెచ్చి ఇచ్చుటయు రాజు గారు సేవించుటయు జరిగినది.

ఒక్క నాడీతడు భుజించు సమయమున ఆ శాకమును నంజుకొనుచు, ఆ కూర తెచ్చు బ్రాహ్మణుని భోజనాంతరమున కాన్పింపు మని సేవకుల కాజ్ఞాపించెను, రాజుగారు భుజించి చేతులు కడిగికొన్న వెంటనే వారు శ్రీ రామ మిశ్రులను తెచ్చి కాన్పించిరి. యామునులు ఆయనకు నమస్కరించి వచ్చిన ప్రయోజన మడిగెను.

"మహారాజా, మీ పెద్దలు ఒక నిక్షేపమును గూర్చి యుంచిరి. అది ఉభయ కావేరీ మధ్య ద్వీపమున నున్నది. దానిని మీకు చూప వచ్చితి" నని ఆయన పల్కెను. ఇంకను రామ మిశ్రులీ విధముగా ననిరి.

"నా కేటికి నిక్షేప మని అనకుము. నిధులుగనులు నర నాథుల సొమ్మె కావున దాని విధమును విన్నవించు చున్నాను.

పడగలలోని మణులు ప్రకాశించుచుండగా తెల్లని త్రాచొక్కటి ఆ నిధినిచుట్టి యుండును. అది రక్షోగృహీతమను ప్రథ తొల్లిగలదు కాని ఆ రేడు నెలల కొక్కసారి నప్ప రాక్షస ప్రత్యక్షము అచ్చోట కలుగదు. ఆ నిధి ప్రాణి హింసాది పూజలకాసించదు. ఏ పాపి పూజయైనను దానికి చాలును. అంజన దృష్టికది గోచరముగాదు. ఎట్టి బంధనములును లేనివారికే అది కనుపించును. దాని వెల ఇంతంత కాదు. అపూర్వరత్న మొక్కటి దాని మీద మెఱయుచుండును. పద్మము, శంఖము అనుమాట లేమిటికి ఆ నిధి అక్ష యము, అనంతము, అవ్యయము. ఏకాంతమునందు నీ కొక్కనికి తప్ప ఇత రులకు దానిని చూపవీలు కాదు."

అని విన్నవింపగా యామునులు సంతసించి సేనాసమేతులై ఆ బ్రాహ్మణుని ముందు పెట్టుకొని ఉభయ కావేరీ మధ్యమునకు వెళ్లిరి. తర్వాత

శ్రీరంగమున కరిగి, కావేరీ చంద్రపుష్కరిణులందు తీర్థం బాడి ఆ మహా రాజు రంగనాథుని సేవించెను.

తర్వాత మహారాజు ఎందుపోవలెనని శ్రీ రామ మిశ్రులనడుగగా, "మీ పెద్దలు కూర్చిన నిక్షేపమిదియే, దీనిని స్వీకరింపు" మని శ్రీ రంగ నాథుని పదయుగ్మమును చూపెను.

యామునాచార్యునికి హఠాత్తుగా జ్ఞానోదయ మైనది. ఆయన భ్రమ వీడిపోయినది. ఆయన తన పూర్వదశను దలంచుకొనెను. ఇన్నాళ్లు జరిగిన తన ప్రమాదంబునకుం బరమనిర్వేదన నొందెను. 'నీ వెవ్వండ'వని రామ మిశ్రుల ప్రశ్నించెను. ఆ యోగివర్యుడును, "అయ్యా, మీ పితామహుండగు శ్రీనాథముని ప్రశిష్యుండను, భావిభవజ్జన్మం బెఱిగి నీ చేత విశిష్టాద్వైతంబు సకల భూత హితంబుగా వెలయంగల యదియని నిశ్చయించి నీకు ద్వయంబుపదేశింపు మని తన శిష్యుండగు పుండరీకాక్షునకు నాథమునులు ఆజ్ఞాపింపగా, ఆయనయు యోగాసక్తుండగు నిన్ను చేరక నన్నీ పనికి నియోగించెను". ఇది వినగనే యామునులవా రతనికి సాష్టాంగ ప్రణామంబు చేసి అతనిచేత పంచ సంస్కార సంస్కృతుండయ్యెను.

అంత నిలువక తురీయాశ్రమంబు స్వీకరింప నిచ్ఛ పొడమగా, స్కంధావారంబునకు మగుడివచ్చి తన కుమారుని యందు రాజ్యభారంబు పెట్టి వానికి రాజనీతి నుపదేశించెను.

(సశేషము)



కవిత:

# నా స్వామి

—శ్రీ గాడేపల్లి కుక్కుటేశ్వరరావు

ఈ పాట నను తిరిగి పాడమన బోకోయి
నా భావమును చూచి నవ్వబోకో స్వామి!

ఒక సారి పాదాలు పట్టుదా మనిపించు-
ఏదో తలపున మెదలి ఇపుడు కా దనిపించు
నిదురించు నపుడెపుడొ అంటుకుంటాలే
చుట్టు ప్రక్కల చూచి మ్రొక్కి పోతాలే....

ఒకసారి మనసార వందనం బసవత్తు
చిలిపి వలపుల మెఱగి చేతులెత్తగ వెరతు
ఇక కొంత తడవాగి ఇటు తెచ్చి మన నమము
పంజెదీపము పెట్టి అంజలించెదలే....

ఒకసారి నావాడ వని యందమనుకొందు
నోట కొట్టుక లాడు పెదవి త్రోసుకరాదు-
ఒకరిలో ఒకర మేకమ్మైన గడియలో
చెవిలోన చెవిలోన చెప్పి మురిసెదనోయి...

ఒక సారి నీదాన నని చెప్పుకొన బోదు
పై మాట బూటకమ్మను కొందువని వెరతు
జన్మాల లేఖగా హృదయ ఫలకము క్రింద
'నీదాసి' నని వ్రాసి చేవ్రాలు చేసెదను....

ఈ పాట నను తిరిగి పాడుమన బోకోయి
నా భావమును చూచి నవ్వబోకో స్వామి!!

## పుస్తకపరిచయము :

# ప్రాగ్జ్యోతి

ఎడ్విన్ ఆర్నాల్డు ఆంగ్లములో రచించిన
'లైట్ ఆఫ్ ఏషియా' అను పద్యకావ్యమునకు అనువాదము

క్రౌను సైజులో ౨౮౮ పుటలు　　　　ద్విపద రచన

రచయిత : కొండా రామచంద్రారెడ్డిగారు, ఎం. ఏ. ఎల్. ఎల్. బి. ఏడ్వొకేట్
రామమూర్తి నగర్, నెల్లూరు.　　　　వెల : మూడు రూపాయలు

ఆర్నాల్డు కవి—1879 లో ప్రచురించిన యీ గ్రంథములో బుద్ధ భగవానుని చరిత్రమును పద్య కావ్యముగా రచించెను. ఇది చదివి చెప్పగా విని తిరుపతి వేంకట కవులు యీ శతాబ్ది ఆరంభములో బుద్ధ చరిత్ర అను కావ్యముగా రూపొందించినారు. అయితే ఇందు వృత్తములు సంస్కృత ఛందస్సులు పాటించుటచేత, మాతృకలోని కథా కావ్యము అంత తేట తెల్లముగా తనుగులోనికి అనువాదం కాలేదు. ఆలోటు తీర్చడానికి, రామచంద్రారెడ్డిగారి 'ప్రాగ్జ్యోతి' కావ్యము రచించినారనవచ్చును. ఇది మంజరీ ద్విపదలో రచించినా, యతి ప్రాసల ప్రతిబంధకము పెట్టుకొనక స్వేచ్ఛగా కథను యథా మాత్రకంగా నడిపించారు.

సిద్ధార్థుడను రాచ బిడ్డగా బుట్టి
బుద్ధ ప్రభుండయి పుడమి జెంపొంది
నిర్వాణ ధర్మము నెలకొన జేసి
ఈరేడు లోకాల నీడు లేనట్టి
పరమ కారుణికుండు పరమ పూజ్యుండు
పరమ విజ్ఞానియు పరమ గురుండు
గా జీవ కోటుల గాపాడినట్టి
పురుషోత్తముని గాథ! పరమ[illegible]బోధ!

ఇట్టి గ్రంథమును అనువాదము చేస్తూ 'అనువాదకుని మనవి'లో కవి యిట్లు చెప్పుకొన్నారు.

'ఆర్నాల్డు మహాశయునిచే నాంగ్లమున విరచింపబడి విశ్వవిఖ్యాతి గాంచిన 'ఆసియా వెలు'గను నాంగ్ల కావ్యము నా యభిమాన గ్రంథములలో నొకటి; బుద్ధుని బుద్ధ చరితంబును, బోధ సుధయు మదీయాదర్శములలో మేటి; యతి
[illegible]

సరళకవనంబును సెలయేటి నితర భాషలలోవలె, తెనుగు తోటలో వెలయింప జేయుట నా చిన్ననాటి యాశయములలో నొక్కటి.'

ఇట్లు తెలిపిన తరువాత, చివర తమ కృషిని గూర్చి అనువాదకు లిట్లు నివేదనము చేసికొన్నారు.

"ఆర్నాల్డు మహాశయుడొకచో తన యుపోద్ఘాతమున నుల్లేఖించినట్లు గౌతమ బుద్ధుని మహోన్నత వర్తనమును, నమ్మహనీయుని సిద్ధాంత సారములను నీ తెనుగుసేత పాఠక లోకమునకు సుగమంబగునట్లు కొంతకు గొంత తోపింప జేసిన, నా కృషి సఫలత నొందెనని భావింతును.'

ఇంత వినయముగా చెప్పుకొన్న వీరి కృషి - యీ కావ్య రచనలో చక్కగా ఫలించినదని చెప్పవచ్చును. ఆర్నాల్డుకవి ఆంగ్ల సాహిత్యములో అజరామర కావ్యముగా చేసిన యీ 'ఆసియా వెలుగు' లోని కాంతి ప్రపంచమును తెలుగువారి కందించుటలో ఈ యనువాదకులు విశిష్ట ప్రయత్నముచేసి, ఆ ప్రయత్నములో కృతకృత్యులయ్యారు. ఆర్నాల్డుకవి తన కావ్యానికి రచించిన తొలి పలుకులు కూడ చేట తెనుగులో వీరు అనువాదం చేసి, తెనుగు పాఠకులకు మంచి ఉపకారం చేశారు. సిద్ధార్థుడు మహాభినిష్క్రమమునకు ముందు శుద్ధోదనుడు కన్న కలను వర్ణించు ఘట్టమును ఎంత మృదులంగా వర్ణించారో చూడండి.

ఆ నిశీధింతయు శుద్ధోదనుండు
కలవర మొందెను కల లిట్లు గాంచి
ధగధగ మెఱయుచు పెద్దపతాక
మధ్య మార్తాండ బింబము వెలుగంగ
రెపరెప మనె నింగి నింద్రునిదివలె,
పెనుగాలి యరుదెంచి పట్టు పతాక
చించి ముక్కలుగాగ బడవైచె బుడమి
నీడమేనులవారు గుంపుగా వచ్చి
చెడిన జెండా నెత్తుకొని మోసికొంచు
తూర్పుగాబోయిరి ద్వారంపు ద్రోవ.

సిద్ధార్థుడు పోవగా సమకట్టి వీడ్కోలు సమయములోని వర్ణన.

సంకల్ప సిద్ధుండు సర్వార్థ సిద్ధి
పోవంగ సమకట్టి, పోగాలురాక
తడబడ గాళులు, దడదడ గుండె
కొట్టుకో, జేతులు గట్టిగా బెట్టి
మూడుమార్లు తిరిగె మంచముచుట్టు
దైవసమముగా నెంచుచు మదిని

ఫాలభాగము సోక పాదాంగుళులను
చెలి పాదముల దాకె ప్రేమపూజారి
అశ్రువు లింకను నింకకున్నట్టి
ప్రేయసి ముఖపద్మమందున ప్రాలె
అంతట నాతని చూపు తుమ్మెదలు
మగుడ వెంతటికిని మాధుర్య మహిమ
లేఖని కంద దప్పటి భావదీప్తి
మరులు మఱల్పంగ తగులము ద్రెంప.
ఎంత లెంత లవుర! యెంతవారికిని!

జ్ఞానోదయమయిన సన్నివేశమును తెలుపు ఘట్టము!

విజయంబు చేకూర బుద్ధప్రభునికి
జ్ఞానోదయంబుగా దెలిసికాంతోలు
తెల తెలవారెను తూరుపు దెసయు;
అరుదెంచె నద్భుతంబై యుషశ్శోభ;
ఆ శోభదివసపు తొలిసంజతోడ
రాతిరి కాంతతా దాల్చిన నలుపు
ముసుగు ముత్తలు విడివడి జాఱిపోయె
వెల వెలబాఱెను వేగుజుక్కయును.

సరళముగా, సాఫీగా సాగిపోయిన యీ బుద్ధగాథ ఎంతో మనోహరంగా రామచంద్రా రెడ్డిగారు చిత్రించారు

తేట తెనుగులో రచించిన యీ తెనుగు కబ్బమును 'తల్లికి మించిన దైవంబు గలదె, తల్లి ఋణముదీర్ప తరమె నా తలమె' యని తల్లిగారికి సమర్పణ చేయుట సముచితముగా నున్నది.

బుద్ధ చరిత్రను పూర్ణముగా తెలుసుకొనగోరువారికి యీ యనువాదము ఎంతయినా ఉపకరిస్తుంది. 'ప్రాగ్జ్యోతి' ప్రయోజనకరమైన తెనుగు కావ్యములలో నొకటి.

శ్రీవాత్సవ

# ప్రభంజనం (ఖండకావ్య సంపుటి)

# పర్జన్యము (కావ్యం)

రచన:- జ్ఞానానంద కవి, వెల: ఒక్కొక్కటి ఒక రూపాయి

ప్రతులకు:- జ్ఞానానంద కవి, మెక్లారిన్ ఉన్నత పాఠశాల, కాకినాడ.

కవి సమ్రాట్ విశ్వనాథ వారి సాహచర్య బలంతో కలంపట్టి, సహజ కవితా ప్రతిభతో సాహిత్య జగత్తులో రవ్వలు రాల్చిన యువ కవి జ్ఞానానంద కవి. డిగ్రీలు పెద్దగా లేకపోయినా, ఆరు శాస్త్రాలు అంతగా చదువకున్నా; ఉన్న పరిమిత పాండిత్యాన్ని మిన్నగా ఉపయోగించుకొని ప్రౌఢ కవితా మార్గంలో సంచరిస్తున్న కవితా విశారదు డీతడు. అక్కడక్కడ ఇతని కవిత్వంలో విశ్వనాథవారి ముద్రతో నలిగిపోయిన పదాలు దొర్లినా, ప్రధానంగా ఈ కవి జాషువా కోవకి చెందినవాడే. వస్తు విన్యాసంలోనేమి, అనుభూతి తీవ్రతలోనేమి, భావోల్బణంలోనేమి, జిగిదేరిన నిర్ఘాతపలుకుపుల్ల గిల్కరింపులోనేమి, సౌహార్దాన్ని సౌభాగ్యాన్ని, సర్వోదయాన్ని శంఖమెత్తి ఘోషించడంలోనేమి – ఈ కవి జాషువా తర్వాత అతని కోవలో ప్రథమ గణ్యుడు. ఈయన పాంచజన్యము అనే కావ్య సంపుటి, ప్రస్తుత సమీక్షలో ఉన్న పర్జన్యము, ప్రభంజనము, – ఈ మూడు కావ్యాలూ, తాను జీవిస్తున్న సమాజంలోని శిఖరాలను, లోయలనూ, వెలుతురునూ, నీడలనూ స్వయంగా అనుభవించి, ఆవేదించి, గుండె నెత్తురులో కలమద్ది వ్రాసినవే. ఒక్కమాటలో చెప్పాలంటే అచ్చమైన అనుభూతి- అసలైన తెలుగు పలుకుబడి, జ్ఞానానంద కవిగారిని అందల మెక్కించే ముఖ్య లక్షణాలు.

'ప్రభంజనం'లో క్రీస్తు ప్రభువును స్మరించేసరికి ఈతని కన్నులకు సిలువమీది రక్తధార కనిపిస్తుంది, దీపావళిని వర్ణిస్తూంటే దారిద్ర్యమూ, లంచగొండితనమూ నిర్మూలించడానికి కంకణం కట్టుకోవలసినదిగా దేశీయుల నుద్బోధించాలని అనిపిస్తుంది. కాబూలు వాడు కనిపిస్తే ఈతనికి కరుణ జలలై పొరుతుంది. తన పుట్టినూరు 'పెదపెంకి'ని తలచుకుంటే చెప్పరాని ఆవేశం వస్తుంది. ఈ విధంగా 'ప్రభంజనం'లోని ఖండికలన్నీ ఒక మహావేశాన్ని పొదుగుకొన్న రచనలు.

'పర్జన్యం' "సమాజ ప్రతినిధిగా కవి భగవంతునికి నివేదించిన భావ సంగ్రథనం." కవిగారు రసహీనుడైన కృతి భర్త మోసం వలన చితికిపోవడం, నిరుపేదల దుర్భర జీవితాలను చూడలేక చలించిపోవడం, ఈ కావ్యానికి బీజం నాటిన విషయాలు. ఈ కావ్యంలో ఆవేశమూ, అధిక్షేపమూ ఒకదాని కౌగిటిలో ఇంకొకటి ఒదిగిపోయినవి. ఈ పద్యం చూడండి.

'ఉల్లాసాన కబుర్లు జెప్పికొని యేవో రిత్త వ్యాసంగముల్
వర్లింపన్ శ్రమపడ్డ పెత్తలను దేవా! కాంచితో, రేశమే
కల్లోలంబయి భిన్న భిన్నముగా కన్పట్టె గో, బల్లెపన్.
సిల్లుంబోసిన చందముండుటను తండ్రీ! మేను లజ్జించెదన్.

ఇంకొకచోట ఈ కవి ఆత్మానుభూతిని వజ్రధారవలె పదునైన సూటి మాటలలో ఇలా చెబుతాడు.

"కవిగా పుట్టరాదు, పుట్టిన త్రిలింగకోటి మధ్యమ్ము ను
ద్భవ మందంగనురాదు జాతులకు ముద్రలు వేయు దేశాన"

ఈ మాటలు కవిగారి దుఃఖిత మనస్సును వ్యక్తం చేసేవిగా ఉన్నవి.

ఈ కావ్యంలో ప్రస్తుత సమాజంలో వున్న కుళ్లంతా ఎత్తి చూపబడింది. జ్ఞానానంద కవిగారికి మామూలు విషయాన్ని సైతం భావ సుందరం చేసే శక్తి ఉన్నందువల్ల ఆయన పద్యం వ్రాసినా చక్కగా విరిసిన చందమామలా అనిపిస్తుంది. పద్యం నడుపడం ఆయనకు సహజసిద్ధమైనదే, పలుకు పుల్ల గంటలు కొట్టిగా ఎత్తిచ్చే నేర్పు ఆయన కున్నది. ఆవేశానికీ, ఊహలకూ కొదువ లేదు. స్వాభావికంగా వస్తువును. పగడంగా మార్చే సహజ ప్రతిభ వాటిలెంత ఉన్నవి. ఆయన పరిహరించుకో వలసింది. 'శుభంబ్' 'జగా' వంటి వ్యర్థ పదాలను. అలవరచుకో వలసింది 'నిలకడ'ను. 'నిల్కడ వలయు కృతికి' అని ఊరికే అన్నారా పెద్దలు.

— 'సింహేంద్ర'

# నాగమ నాయకుడు

రచన (నాటకం) ప్రచురణ.

శ్రీ పెమ్మరాజు వేణుగోపాలకృష్ణమూర్తి జయంతి పబ్లికేషన్సు

వెల : రూపాయిన్నర. బీసెంటురోడ్డు - విజయవాడ-2

ఇది చారిత్రాత్మక నాటకం శ్రీ కృష్ణదేవరాయలు నాగమ నాయకుని మధుర పరిపాలకునిగా నియమించినప్పుడు కొందరి ప్రోద్బలం వల్ల స్వార్థం అంకురించి తాను స్వతంత్రునిగా ప్రకటించుకొనుట-చివరికి తన కుమారుడు విశ్వనాథుని వల్లనే పరాజయం పొందుట ఈ చారిత్ర కాంశాన్నాధారంగా ఎనిమిది రంగాల్లో వ్రాయబడింది నాటకం. సంభాషణలు చకచకా చక్కగా సాగిపోతాయి, స్త్రీ పాత్రలసలు లేవు. నాటకం ప్రదర్శన యోగ్యంగా ఉంటుంది.

— కో. సు.

# బైతరాజు ముమ్మయ విష్ణు కథానిధానం

— శ్రీ రావూరి ప్రసన్న సత్యనారాయణ

"ఎందరో మహానుభావులు" అన్నాడు మహానుభావుడు త్యాగరాజు. వందనానికి వారినే మనం వెదకాలి. 'నరత్న మన్విష్యతి మృగ్యతే హి తత్' అని గదా ఆర్యోక్తి! సత్కవులూ అంతే. అద్దం స్వచ్ఛమైనదైతే ప్రతిబింబానికేం లోటు?

విస్మృతాంధ్ర కవులెంతమందో! వారిలో ఒక విశిష్టస్థానీయుడు విష్ణు కథానిధానకర్త బైతరాజు ముమ్మయ. ఆతని గ్రంథంలోని నలభై యొక్క పద్యాలు మాత్రమే నేడుపలబ్ధాలు. (కీ. శే. బ్రహ్మశ్రీ వేటూరి వారి ప్రబంధ రత్నావళిలో సంగ్రథితాలు) అది ఒక చక్కని కావ్యమై ఉండుననటానికి ఆ పద్యాలు సాక్ష్యం చెబుతయ్. భీమఖండంలోని శివతాండవ సందర్భంలో ఉన్న 'ఆ చెండాండవ మార్భటీ పటహ' అనే పద్యం యథాతథంగా ఈతని పద్యాల్లో ఉండటం వల్ల ముమ్మయ శ్రీనాథుడికి తరువాతివాడని మాత్రం నిర్ణయించవచ్చు. భారవి కాళిదాస శివభద్ర మాఘ బాణ భాసుహ చోర మయూరుల్ని పేర్కొని మిగత ప్రసిద్ధ కవుల్ని తలతునన్నాడు. తెలుగు కవుల్ని గూర్చి ఒక మాటన్నాడు చూడండి.

'పూర్వ కవీంద్రులం గొలుచు పూనికి నిప్పటివారి గొల్తుని
గ్గర్వత నిక్కవీంద్రులు పురాణ కవీంద్రులకంటె తక్కువే
ఉర్విని నేటి వారగుట యొప్పమె నేడును తామ్రపర్ణిలో
పూర్వపు శుక్తి సంపుటములను బోలిన మౌక్తిక రాజి లేదొకో!'

ఈతని హృదయస్థాయిని కొలవటానికి ప్రమాణం ఎక్కడినించి తేవటం! ఎంత సమదృష్టి! ఎంత ఆత్మ విశ్వాసం! ఈతడు 'సంసార సుఖైకసార విలసత్కవితావర వైభవార్థి' సంసారాన్ని సుఖమొనర్చేది కవిత్వమేనట. ఎంత ఉన్నతాభిప్రాయం! షణ్ముఖస్తుతిని తిలకించండి.

'ఏమకు ముతోడ దల్లియును దండ్రియు ముద్దువేడ సం
భ్రమమునవచ్చి తల్లి ముఖ పద్మము దండ్రి ముఖంబులైదు వే
గమ తనయారు మోములను గైకొని ముద్దిడు మేటి వేల్పుం
గొమరుడు నాదువాణికి నకుంఠిత శబ్దము లిచ్చుగావుతన్' అని

యీతడు అప్పకవికి అర్వాచీనుడని ఊహింపనిస్తున్నది. బ్రహ్మస్తుతి నాలోకించండి;

'వల పెటువంటిదో ముసలివాడనవచ్చునె యద్దిరయ్య ప
ల్కుల జవరాలు దాజదుపులోన జపంబులలోన బాయద
గ్గలముగ నెల్ల ప్రొద్దును మొగంబున గట్టిన యట్ల యుండు నీ
నలువకు నంచు కాముకులు నవ్వ విధాత శుభంబు లీవుతన్' ముసలి

వాడైనా బ్రహ్మ యెప్పుడు భార్యను మొగంమీదఉంచు కొంటాడే అని కాముకులు నవ్వు కుంటారుట. సంప్రదాయాన్ని చక్కగా కవి చమత్కరించాడు.

కవి యీ గ్రంథంలో విష్ణులీలా మాహాత్మ్యాన్నే వర్ణించాడు. హరిహరాద్వైత భావన యీ కవికి ఉన్నదనవచ్చు. ఆ ఉభయుల ఉనికి నేకత్ర వర్ణించాడు:

'లసదురః స్థలమున పసనైన గళమున
విలసిత లీల శ్రీ నిలిపినారు
చరణంబు పట్టున జడలలో చుట్టున
ననుపొందగా గంగనునిచినారు
భవ్యగుణంబున దివ్యదేహంబున
నొఱపు మీఱగ భూతి మెఱసినారు
తిరముగా మూపున కరమొప్పుమోపున
పొలు పొందగా ధాత్రి పూనినారు
తెల్ల గలయిండ్ల నిలిచి వర్తిల్లినారు
ఇరువురిరువుర భార్యల నేలినారు
పెక్కుమొగముల కొడుకుల పెనిచినారు
హరి హరులు మీరు సర్వలోకాధి పతులు'

'తథాపి భక్తిః కమలా హృదీశ్వరే' అని మార్చాలి ఈకవి విషయంలో. మీరు సర్వలోకాధిపతులు అనటంలో వారి యెడ యీ కవి పూహించిన చనవు ఎంతో వ్యక్తం. బాల కృష్ణుడి యందు హరిరూపాన్ని ఎంత రమ్యంగా దర్శించాడో చూడండి:

'అరుణ జటాచయంబును దిగంబర భావము సాంద్రధూళి ధూ
సరిత శరీరమున్ వెఱపు చంద మెఱుంగమి [illegible]

దిరుగుచు నున్కియున్ గలిగి తొల్లముచేసె యశోదపట్టి దా
హారిహారు లేక మౌట ననయందతి శైశవ విభ్రమంబునన్' ఎట్టని
జడలు-దిగంబరత్వం, ధూళి ధూసరిత శరీరం, ఎల్ల చోటులా తిరగటం
హరి హరైక్య చిహ్నాలట. ఈ కవి తిక్కన అనుయాయి అనవచ్చు ఐనా.
విష్ణువుపైనే మోజెక్కువ. గ్రంథం విష్ణు కథానిధానం గదా! వారి వనితల
రూపం నిఖిల శాస్త్ర నిలయమట, పరిశీలింపుడు :

'ఉత్తుంగకర్కశ వృత్తస్తనంబుల
నద్వైత భావన యతిశయిల్ల
నత్యంత శూన్యతాయత్త మధ్యంబున
నాస్తిక తత్త్వంబు విస్తరిల్ల
స్నిగ్ధారుణారుణ ముగ్ధాధరంబున
బ్రాభాకరాపూర్వ శోభదొలక
విట మనోవిదళన స్ఫుట కటాక్షంబుల
భేద సిద్ధాంతంబు పెంపుమిగుల
మేన వైశేషిక ప్రభ గానబడగ
నొప్పుదురు వారి కామినులిప్పురమున
దలపగేవల కామ శాస్త్రంబె కాదు
నిఖిల శాస్త్రంబులును నిందు నెగడుననగ'

ఎత్తున-కర్క-శత్వమున, వృత్తతలో కుచము లద్వైతబోధకాలట.
శూన్యమైన నడుములు నాస్తికమతాన్ని స్ఫురింప జేస్తవట. కొంచెం ఎఱ్ఱ
నైన అధరాలు ప్రాభాకరమత స్ఫోరకాలుట. కటాక్షాలు భేద సిద్ధాంత
స్మారకాలట (చూపరుల భేదిస్తయ్యనటం) మేనున వైశేషిక ప్రభ (విశేష
మైన కాంతి) ఉందిట. కవి సర్వ శాస్త్ర పరిచితి భావ పవిత్రత స్పష్టం.
అవస్థాచిత్రణ: మురళ సమ్మానం చేసే గోపాంగనలు:

'కమ్మలు నటియించుగతులకు కడు మెచ్చి
చెక్కుల చిరునవ్వు సేన చల్ల
బిగువు చనుంగవ బింకంబునకు మెచ్చి
లీలమై చూపు నివ్వాళిసేయ
జఘనంబు చేసిన శౌర్యంబునకు మెచ్చి
[illegible]

ఊరుకాండంబు నొయ్యారంబునకు మెచ్చి
మొలనూలు కైవార మొలమి జేయ
చెమట గరగిన తిలకము చెదరగురులు
గలగ వదనము విరిదమ్మి చెలువుదెగడ
మదన సమ్మానమంచలి ముగతనమున
మెలయు గోపాంగనల పొందు మెచ్చె శౌరి'

చెవికమ్మ లసియాడుతూ చిరునవ్వుతో కుచముల మీద నున్న దృష్టితో తలలోని పూలు జఘనం మీద రాలుతుండగా ఊరువు లొక్కటి కాగ నిలుచుండి చెదిరిన ముంగురులు చెమటచే కరిగిన తిలకం, వదన ప్రభ నినుమడి చేయ గోపికలు మన్మథపూజ చేరారట. 'ముగతనమున' అనటం శౌర్య సూచకం. శూరత్వం (తెగువ) లేనిదే కార్యం సిద్ధించదు గదా! గోపికల ఆతురత, భక్తిలోని యేకాగ్రత స్పష్టం. గోపికలకు సర్వం కృష్ణుడే. గోపికా భక్తి భాగవతంలోనే వెడప బడింది. ఇది మధుర భక్తి సంప్రదాయం లోనిది. సురాసురుల కమృతం వడ్డించే మోహిని:

'చనుగవ బయ్యెద జాఱంగ జాఱంగ
కరమూలమున నంటు గదెమి గదిమి
పసిడి పెడపెడ పిడంగ పిడంగ
నెఱిమిసూపుచు జాల నిటికి యిటికి
నుదుటిపై నలకలు చెదరంగ చెదరంగ
నల్లని వింటిచేత నదిమి యదిమి
పాదతలంబు పొవలంగ పొదలంగ
నదరు నూర్పులచేత నడచి యడచి
చన్నులును పతికలశంబు సరసమాడ
నఖ్య సమ్మృతంబు దమలోన నవ్వులాడ
సిగ్గు తమకంబు వినయంబు జెంగలింప
వెలది యమృతంబు వడ్డించె విబుధపతికి'

నవ్వు - సిగ్గు - తమకం - వినయం అనేవే యీ వెలది (మోహిని) విశిష్ట లక్షణాలు. విశిష్ట లక్షణ నిర్దేశమే పాత్ర పోషణ కుపస్కారకం. సామాన్య లక్షణాలెన్ని చెప్పినా పాత్ర మనకు ప్రత్యక్షం గాదు. ఇట నవ్వు, సిగ్గు, తమకం, వినయం తెచ్చి పెట్టుకున్నవి. అదీ ధర్మ సంస్థాపన కొరకు,

జగన్నాటక సూత్రధారి అని భగవంతుణ్ణి చెప్పటంలోని అర్థం మన కిక్కడ బాగా మనసుకు పడుతుంది. ఏ పాత్రకు ఎట్టి ప్రసక్తి - ఎంత ప్రాముఖ్యం అనేదానికి నిర్ణేత ఆతడే. పై జెప్పిన నవ్వు మొదలైన లక్షణాలకి వ్యాఖ్యానమే పూర్వ వర్ణన అంతా. ప్రేమకు నవ్వు - చేసేది నటన అంటానికి తమాషా చిహ్నాలు. సిగ్గు, వినయం ఆమె పాత్ర కావశ్యకాలు. ముమ్మయ దృష్టిలోని సద సత్కవుల నీక్షించుడు:

'ఆహా! కావ్యము మేలు మేలనమి యన్యాయంబు వో శారదా
ద్రోహం బేటికి గట్టి కో ననుచు సంతోషించు నట్లుండు న
య్యూహోదుల్ విని సత్కవీంద్రుడితరుండొప్పెంబపేక్షించు సం
దేహించుం దన సొమ్ము పోయినగతిన్ దీనత్వముం బొందుచున్'

కావ్యము విని సత్కవి మేలుమేలు అంటాడట. కుకవి తన సొమ్ము పోయినట్లు సందేహిస్తూ వుంటాడట. ఇట సత్కవి అంటే సద్విమర్శకుడన వచ్చు. తన సొమ్ము పోయినట్లు అనటం చమత్కారావహం. సుకవి, కుకవి అనటంలో మన పూర్వులు సద సద్విమర్శకులనే ఉద్దేశించారేమో అనవచ్చు. 'బలవదపి శిక్షితానామాత్మన్యప్రత్యయంచేతః' అనే సత్యమే హేమాహేమీలైన కవులు కూడ కుకవుల ఊసునెత్తటానికి హేతువని వూహించవచ్చు. పురమందలి కామినుల నవలోకించండి.

'పలుక నేర్చిన రత్నంపు ప్రతిమలనగ
తిరుగ నేర్చిన వెన్నెల తీగలనగ
పొంద నేర్చిన పుత్తడి బొమ్మలనగ
నొప్పుదురు కామినీమణులప్పురమున'

పలక నేర్చిన రత్న విగ్రహాలవలె, తిరుగ నేర్చిన వెన్నెల తీగలను బోలి, పొంద నేర్చిన బంగరు బొమ్మలా అన్నట్లున్నారట. ఇందలి ఉత్ప్రేక్షరమ్యం. కవి భావనాశక్తి - శిల్పచాతురి - వర్ణనానైపుణి - చమత్కార సరణి స్పష్టాలు. పురసంహారానికి వెళ్లే శంకరుని యుద్ధ సన్నాహం తిలకించండి.

'కదలదు తేరు రథ్యములు గట్ట నశక్యము సూతుడంటిమా
ముదుసలి చక్రముల్ సరస మోపు ఘటిల్లనివల్ల నారియున్
గుదిగొనునమ్ము శార్ఙ్గమునకుం బనుపడ్డదిగాన వింత పెం
పొదవ బురత్రయంబు నెట్టులోర్చితివో త్రిపురాంతకేశ్వరా'

అన్నాడు. త్రిపురనాశానికి శంకరుడికి భూమియే రథమైంది. చతుర్వేదాలు గుఱ్ఱాలయ్యాయి. బ్రహ్మసారథి అయ్యాడు అనే సంప్రదాయం ప్రసిద్ధం. ఈ పద్యంతో సంవదించే పద్యాలను రామకృష్ణుడు (పాండురంగమహాత్మ్యం) చిమ్మపూడి అమరేశ్వరుడు (విక్రమసేనం), బొడ్డపాటి కొండయ (చాటువు) పెదపాటి సోమయ (శివజ్ఞానదీపిక), బొడ్డపాటి పేరయ (చాటువు), పాలపర్తి సోమేశ్వరుడు, రంగనాథుడు, భాస్కరుడు, కర్త తెలియని యొక పద్యం (ప్ర. ర.లో ఉదాహృతం) మొదలైన వారు రచించారు.

సరస కావ్యరచనా చణత్వం నిరూపించుకొన్న యీ ముమ్మయ విష్ణు కథానిధానం పూర్తిగ లభిస్తే ఎలా వుండేదో! ఆతని నామం చిరస్మరణీయం.





ది 2-8-60 న రాష్ట్రపతి నిలయంలో రాష్ట్రపతి డా॥ రాజేంద్రప్రసాదు గారిని శ్రీ ఉన్నవ రాజగోపాల కృష్ణయ్య.